# దేశభక్తి, ప్రబోధగేయాలు, నీతి పద్యాలు

# DESA BHAKTI, PRABODHA GEYALU, NEETI PADYALU

**(Telugu Songs, Lyrics & Poems)**

**(1955 - 1980)**

***By***

**Dr. M.V. SATYANARAYANA,** M.A., Ph.D.
Editor : Telugu & Sanskrit Manuscripts
Dr. V.S. Krishna Library
Andhra University
VISAKHAPATNAM - 530 003
A.P., INDIA

# దేశభక్తి

## విషయ సూచిక

## (CONTENTS)

## PART - I

### I



### II



### III



## ABOUT THE AUTHOR

| | | |
|---|---|---|
| Parents | : | Sri Modekurti Seetarama Swami & Smt. Veera Lakshmi |
| Birth Place | : | Badangi, Vizianagaram (Dist.) A.P. South India. |
| Date of Birth | : | 15-12-1928 |
| Qualifications | : | Teaching - Telugu Departmetns in the Degree colleges (1952-57) Dictionary compilation; publication work, in Telugu Department, Andhra University - 1957 July to 31st Dec. 1988. ADULT Education Dept. A.U. from Sept 1989. Editor : Manuscripts section Dr. V.S. Krishna Library, Andhra Unviersity / March 1993 till now. |
| Personal Publications | : | Sri Venkatachala Maahaatmyamu, Sri Jagannatha Kshetra Mahatmyamu (Telugu Prose) Andhra Chandovikaasamu Ph.D. (Thesis) in Telugu 1965. 5 Satakas in Telugu. |
| Books | : | Edited & Published by the Andhra University (1) Navakavita (176 Telugu Modern poetical Selections) (2) Kaavyasameekshalu (30 critical essays on old Telugu Kaavyas, Vayojanavidya paatalu etc. Descriptive catalogues of Telugu & Sanskrit Manuscripts (2 vol) pub by A.U. 1999 & 2004. Deputed by the Andhra University to participate in State, National and International conferences. More than 70 Radio talks broad cast. AIR Vizag. |
| To be published | : | 1. Desabhakti (Telugu songs, etc.)<br>2. Daivabhakti (5 Satakams etc.)<br>3. Sri Panduranaga Satakamu (Telugu with English & Hindi versions) |

*Jnanpith Awardee*
Dr. C. Narayana Reddy Ex. M.P.
M.A., Ph.D., D.Litt.
PRESIDENT
Andhra Saraswatha Parishath
Tilak Road, Hyderabad - 500 001.
Phone : (Off.) 24753724



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
డాక్టర్ సి. నారాయణరెడ్డి ఎక్స్ ఎం.పి.
ఎం.ఏ., పిహెచ్.డి., డి.లిట్.
అధ్యక్షులు
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్, హైదరాబాదు-500 001.
ఫోన్ : (ఆ) 24753724

తేది : 02-07-2009

సం.

# అభినందన

ప్రముఖ సంస్కృతాంధ్ర విద్వత్కవులు డా. ఎం.వి. సత్యనారాయణగారు నాకు పూర్వ సుపరిచితులు. వారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో తెలుగు, సంస్కృత లిఖిత ప్రతుల సంపాదకుడుగా విశేష కృషి చేశారు. ఈ గ్రంథం వారి సృజనాత్మక ప్రతిభకు ప్రతిబింబంగా నిలుస్తున్నది. ఈ సంపుటిలో ప్రధానంగా గీతాలు, గేయాలే వున్నాయి. కొన్ని పద్యాలున్నాయి. వారి పద్య గ్రథన పటిమకు నిదర్శనంగా మచ్చుకు ఒక్కటి ఎత్తి చూపుతున్నాను.

"పరమ పావన నదుల్ ప్రవహించునన్నాళ్ళు
భారత స్వాతంత్ర్య భంగమగునె
భగవదాలయ గిరుల్ భరత భూమిని నుండ
భారత స్వాతంత్ర్య భంగమగునె"

ఇలా ఈ సీస పద్యాన్ని ధారాశుద్ధితో, భావ సిద్ధితో సంతరించారు సత్యనారాయణగారు. వారి గేయ రచన వివిధ వస్తు భరితంగా వుంది. ప్రబోధాత్మకంగా, అధిక్షేపాత్మకంగా రాసిన గేయాలతో పాటు తేట తెలుగులో రచించిన గీతాలూ వున్నాయి. "బంగారు పాపాయి" అనే శీర్షికతో వారు పలికిన ఒక పాటలో ఇలా అంటారు వారు –

"పాప పుట్టిన చోట బంగారు కోట
పాప తిరిగిన నేల బంగారు కోట"

"మానవుడు – దానవుడు" శీర్షికతో రాసిన గీతంలో సత్యనారాయణగారు అంటారు ఇలా –

"మతమెందుకు మతి వుంటే
కులమెందుకు గుణముంటే
జాతెందుకు నీతుంటే
దేవుడేల దయవుంటే"

ఇందులో అచ్చమైన మానవీయ దృక్పథాన్ని ఒక మనస్తత్వంతో చిత్రీకరించారు. డా. సత్యనారాయణగారు. వైవిధ్య విలసిత కవితలను ఈ సంపుటి రూపంలో అందిస్తున్న డా. ఎం.వి. సత్యనారాయణగారికి నా హార్థికాభినందన.

**– డా.సి. నారాయణ రెడ్డి**



Pages 8 to 60 containing opinions expressed by various Telugu poets and famous personalities were not included to reduce the file size.

## PART - I

# 1. దేశభక్తి

జాతి ద్వేషం – భాషాద్వేషం
కులమత భేదాల్
కల్పించి – కల్గించి
వేషాలెన్నో వేసింది
దోషాలెన్నో – చేసింది –
నీతి నియమాల్ – సడలించి
పర ప్రభుత్వం
మన దేశంలో
ఎంత కాలం – సాగిందోయ్
ఎంత వింతగా – ముగిసిందోయ్

★★★

అన్నెం పున్నెం – ఏమీ ఎరుగని
అమాయకుల్ని – బాధించి
అన్యాయంగా – దోచుకున్న
పర ప్రభుత్వం – మనలేదోయ్
ఎంత కాలం – నిలిచిందోయ్
మన దేశంలో – ఇపుడుందా?
చీలించి – పాలించిన
పర ప్రభుత్వం – ఏమైంది ?

★★★

మన జాతులు – మన భాషలు
కులాల్ – మతాలు
కట్టూ – బొట్టూ
తిండి తిప్పలు – వేరైనా
మనమంతా – భారతీయులం
భారత మాత – పుత్రులం

★★★

పరదేశ – ప్రాభవాన్ని
విదేశాల – జోక్యాన్ని
శత్రుదేశ – దాడుల్ని
సహించం – సహించం
ఏకమై – ఎదిరిస్తాం

★★★

మన గాంధీ – మార్గంలో
శాంతి ధర్మ – పథంలో
వీర్యాన్ని – ప్రకటిస్తాం
క్రౌర్యాన్ని – అణచేస్తాం
ధైర్యాన్ని – చూపిస్తాం
స్థైర్యాన్ని– కనపరచి

సాహసాన్ని – చవిచూపి
ఐకమత్యం – మనకుందని
అందరం – ఒకటేనని
భరతమాత – పుత్రులమని
దైవశక్తి – యుక్తులమని

★★★

రణరంగం – సంరంభంలో
రణభేరీ – మోగిస్తాం; మన
శత్రువుల్ని – హతమార్చి, మన
మిత్రుల్ని – సైనికుల్ని
బుజ్జగించి –

విజయాల్ని సాధిస్తాం
జయభేరీ – మోగిస్తాం
జయపతాక – ఎగరేస్తాం
జయలక్ష్మిని – పూజిస్తాం

భరతమాత–పవిత్ర కీర్తి
ప్రతిచోటా – చాటుతాం
ఈ దేశ – స్వాతంత్ర్యం
తరతరాలు – నిల్పుతాం ॥

సమైక్యత – సమానత్వం
మానవత – మన లక్ష్యం
ధర్మాన్ని – పాటిస్తాం
శాంతిని – స్థాపిస్తాం ॥

## 2. భారత దేశం

భారతదేశం – పరమ పవిత్రం
భారత వర్షం – పుణ్యక్షేత్రం
ఈ దేశం – యజ్ఞపునీతం
మన దేశం – లోక పూజితం ॥

కర్మభూమి – మన దేశం
ధర్మభూమి – మన దేశం
జ్ఞాన భూమి – ఈ దేశం
ముక్తి భూమి – ఈ దేశం ॥

యుగయుగాల – చరిత్రలో
అవతార – పురుషులతో
సూర్య చంద్ర – వంశాలతో
రాజిల్లిన – దీ దేశం ॥

ధర్మహాని – కల్గినపుడు
ధర్మ రక్షణార్థమిచట
ఆదివిష్ణు – వవతరించె
పలుసార్లీ – దేశంలో ॥

రామాద్యవతారాలను
ఆదివిష్ణువే - దాల్చి
రావణ కంసాదుల నిట
శిక్షించి, నరుల గాచె ॥

సత్య హరి శ్చంద్ర నృపుడు
కర్మయోగి - జనకరాజు
దశరథుడు - ధర్మరాజు
పాలించిన - దీ దేశం ॥

విశ్వజనులు - మెచ్చినట్టి
వేదాలిట - విలసిల్లెను;
వేదార్థాలను - తెల్పే
వేదాంగాలు - వెలసినాయి ॥

ఉపనిషత్తు - లుత్తమములు
జ్ఞానయోగ - బోధకములు
సాధకులకు - సాధ్యమ్ములు
వెలసె, ముక్తి - పరములిచట ॥

ఆదికవి - వాల్మీకి రచిత
రామాయణ - మాదికావ్య
మయ్యె జగతి - నా దర్శము
రసానంద - ముక్తి పథము ॥

నారాయణు-డవతరించె
పరాశరుని - పుత్రుడుగా
అష్టాదశ - పురాణాలు
రచియించిన - వ్యాసు డతడు॥

గంగా - గోదావరి - కృష్ణ
యమునా - కావేరి నదులు;
సింహాచలం - శ్రీశైలం
తిరుపతి - దేవాలయాలు॥

కాశీ గయా – ప్రయాగ
రామేశ్వర – తీర్థాలు
భారత – దేశాన గలవు
జనుల పాప – హరములగుచు ॥

మహాకాళి – కనకదుర్గ
చాముండేశ్వరి – శక్తులు;
విశ్వనాథ – జగన్నాథ
దేవుళ్లు – వెలసి రిచట ॥

వ్యాసముని – రచితమైన
సంస్కృత – భారత కావ్యం
వేద తత్త్వ – బోధకమై
పంచమ – వేదంబయ్యెను ॥

భగవానుడు – శ్రీకృష్ణుడు
పార్థున – కుపదేశించిన
గీతకు – వ్యాఖ్యానా లిట
వెలసె, వివిధ– రీతులలో ॥

నారదాది – దివ్య మునులు
అవతరించి – యీ భువిపై
భక్తితత్త్వ – ప్రచారాన్ని
సల్పిరపుడు – చక్కగాను॥

ఆత్మ ద్రష్ట – లయిన ఋషులు
ఆత్మరూపు–లయిన జనుల
ఆధ్యాత్మిక – ప్రగతి కొరకు ॥
రచియించిరి – గ్రంథాలు ॥

శంకర–రామానుజాది
మతాచార్యు – లిచ్చటనే
దైవతత్త్వ – మహిమ లెన్నో
గ్రంథ రూపమున – తెల్పిరి ॥

కాళిదాసాది కవులు
కావ్య నాటకాలు వ్రాసి
యశఃకాయులైనారు
వారికి – వారే సాటి॥

రామకృష్ణ పరమహంస
శిష్యుడు – వివేకానందుడు
భారతీయ – వేదాంతం
విదేశాలలో – చెప్పెను ॥

అమర భాషలో – వెలసిన
భారతీయ – సాహిత్యం
అనువదించు–కొనిరి నాడె
పరభాషా – పండితులు ॥

వైదిక వాఙ్మయ మహిమను
గ్రహియించిన – ముక్తిపరులు
మేక్స్‌ముల్లర్ – వంటివారు
ప్రచురించిరి – బహుగ్రంథాల్

మన శాస్త్ర – పురాణాలు
స్మృతులు చదివి – పరవశులై
అనువదించు – కొనిరి యెపుడో
పాశ్చాత్యులు – భక్తవరులు ॥

భారత – భూమిని – పుట్టిరి
వీరులు – రాజులు – మంత్రులు
త్యాగధనులు – మహాత్ములు
కవి పండిత – గాయకులు॥

భరత ముని – నాట్యశాస్త్రం
భారతీయ – సంగీతం
భారతీయ – లలిత కళలు
ప్రపంచాన – ప్రసిద్ధాలు ॥

మహంజొదారో – హరప్పా
త్రవ్వకాల వలన మన
ప్రాచీన తరాల వారి
ఘన సంస్కృతి – కానవచ్చె॥

అజంతా – ఎల్లోరా
అమరావతి – శిల్పాలు
ప్రాచీన–శిల్ప కళకు
ప్రతీకలై – కీర్తి తెచ్చె ॥

భారతీయ – సాహిత్యం
ప్రాంతీయ – భాషలలో
పరివర్తన – మగుచుండెను
వివిధ– ప్రక్రియా– రీతుల ॥

నన్నయ – తిక్కన ఎఱ్రన
పోతన – శ్రీనాథాదులు
ఆంధ్ర– మహాకవులు మనకు
ఆదర్శులు – ఆరాధ్యులు ॥

త్యాగయ్య – పురందరుడు
అన్నమయ్య – గేయ కవులు
దేశ కీర్తి – నినుమడింప
వెలసిరిచట – భక్తవరులు ॥

గంగా – యమునా – జలాల
వైశిష్ట్యం – పవిత్రతను
పాశ్యాత్త్యులు – గ్రహించి, మున్ను
పొగడిరి – వేనోళ్ల యిచట ॥

ఆర్థర్ – అవలాన్ వంటి
న్యాయమూర్తు – లెపుడో యిచట
తంత్రమంత్ర – మహిమంబులు
రచియించిరి – రమ్యంబుగ ॥

ఆనిబిసెంటు – లాంటి స్త్రీలు
భారతీయ – సంస్కృతిని
ఆధ్యాత్మిక – శాస్త్రంబులు
మెచ్చి, ఆచరించి రిచట ॥

అరవిందుడు – రమణమౌని
శివానంద – షిరిడి సాయి
బాలయోగి – సత్యసాయి
యోగ మహిమ – చూపుచుండ్రు॥

పరమతముల – వారికి మన
ఆధ్యాత్మిక – గ్రంథములె
ఆధ్యాత్మిక – సాధనలె
మనశ్శాంతి – నిచ్చుచుండె ॥

విదేశీయు – లీనాడు
మన పురాతన – చరిత్ర
పఠియించుచు – చూచుచుందు
రిచటి పుణ్య – క్షేత్రంబులు ॥

దేశ స్వా–తంత్ర్యానికి
దీక్షా త్యా–గములు చూపి
భరతమాత – కీర్తి నిల్పి
రెంద–రెందరో – యిచ్చట॥

ఝాన్సీ–లక్ష్మీబాయి
కాకతీయ–రుద్రాంబ
నారీ మాంచాలవంటి
ధైర్య త్యాగ–శీలవతులు ॥

గాంధీ, పండిత నెహ్రూ,
తెన్నేటి టంగుటూరి
రాధాకృష్ణ – సర్దార్ పటేల్
నిలిపిరి – మన జాతి కీర్తి॥

## 3. భారతీయుడా !

(1956)

భారతీయుడా ! - భవ్య చరితుడా !
వీర జనని పుత్రుడా ! - విశ్వఖ్యాతుడా! ॥భా॥

సూర్య చంద్ర, వంశములకు - స్థానమీ దేశము
శౌర్య ధైర్య - సాహసముల - సాటిలేనివారము
వీర్యముతో - క్రౌర్య మణచి - విజయమొందు వారము ॥భా॥

ధర్మకార్య - నిర్వహణను - దక్షతతో - గావింతుము
కర్మభూమి - మనదనుచు - కలనైనా; - మరువము
సర్వమెరిగి - సంచరించు - సజ్జనులను - గాంతుము
పర్వదివస - పాలనమున్ - భక్తితో నొనర్తుము ॥భా॥

వసుధైక - రాజ్యమును - వాంఛించుచుంటిమి
పశువర్తన - మిటుపైని - పాడిగాదంటిమి
ఏసు వాసుదేవులకు - లేదు భేదమన్నాము
విసుగు కొనక - విశ్వశాంతి - నెలకొల్పుచున్నాము ॥భా॥

## 4. నమో ఆంధ్రమాతా!

(1956)

నమో ఆంధ్రమాతా ! సుశీలా ! నిఖిల జగద్గేయా !
నమో భారత - సంస్కృతి కళానిలయా॥
నవరస రంజన - వాఙ్మయాలయా ॥నమో॥

శూరధీర - సుకుమార - సుపోషా
శాశ్వత - విశ్రుత - జ్ఞానోపేతా
సారసూక్తి - వైచిత్రి - విశేషా
సంగీత - నాట్య - నటన ఖ్యాతా ॥నమో॥

స్వర్లోక - సదృశ - వైభవదాత్రీ
సార్వజనీన - సుసంప ద్దాత్రీ
సర్వశాస్త్ర - భూషిత - వదనా ।
సత్కవి పండిత - మండల సదనా ॥నమో॥

సంతత – పూత – సజీవ వాహినీ –
సర్వజీవ సుఖ – శాంతి విధాయినీ
అంత రహిత – వేదాంత వేదినీ
అఖిలాశ్రమ – ధర్మబోధినీ ॥నమో॥

సంతతి – తేజఃపుంజా
సకల – రంగ – సంశోభిత జననీ!
హిందూ ముస్లిం – క్రైస్తవాశ్రయా
హిందూ జననీ – హృదయ రంజనీ ॥నమో॥

## 5. ఆంధ్ర జననీ!

(1956)

ఆంధ్ర జననీ – అతి పూతావని
సాంధ్ర యశస్విని – సౌఖ్య సంధాయిని ॥ఆంధ్ర॥

శాంత రూపిణీ – శాంతి విధాయినీ
స్వాంతహారి – భాషామయ గేయినీ
శ్రీధీప్రజ్ఞా – తేజోవిలసిత – మంత్రి మండలీ,
అధీత సకల శాస్త్ర – సార – సచివ మండలీ ॥ఆంధ్ర॥

త్రైమత సమరస – శోభితాంతరంగా
రామరాజ్య – స్థాపనాభిముఖ – చతురంగా
ఇహపర సాధక – మార్గదర్శినీ
అహోరాత్ర – వృద్ధికారిణీ ॥ఆంధ్ర॥

## 6. జై భారత్ – జై బంగ్లాదేశ్

సీ.మా. భారతమాత ! నీ భాగ్యంబు గొంపోవ
పరదేశ వాసులు పాటుపడిరి
పరమ పావని ! నిన్నుపాప బుద్ధి గలిగి
పాలింప గల్గిరే? భాగ్యలక్ష్మి !
అజ్ఞానులై నిన్ను నవమాన పరచువా

రవమాన మొందిరి యవని యందు
ఐశ్వర్య మదముచే హాని చేయ దలంచి
ఐశ్వర్య హీనులై, హతులు నైరి
అల్పులధికులైన నాత్మశక్తి నెఱుంగ
రన్యశక్తియు గూడనఱయలేరు
అగ్నియందు మిడుత లాహుతి యయినట్టు,
అన్యశక్తి వలన హతులెయైరి
ధర్మ కర్మములకు, స్థాన మీదేశంబు
తామస ప్రభులకు, తావులేదు
సర్వ ధర్మములను సంరక్షణము జేయ
భారత దేశాన భవ్య ఋషులు
సంచరించుచుంద్రు శాంతి నొసంగగా
దివ్య దృష్టియున్నదెలియనగును
దివ్యమాత! నీవు దివ్యవీరులగంటి
దేశదైవ భక్తి, తేజరిల్ల 1

పరమ పావన నదుల్ ప్రవహించు నన్నాళ్లు
భారత స్వాతంత్ర్య భంగమగునె
భగవదాలయ గిరుల్ భరత భూమిని నుండ
భారత స్వాతంత్ర్య భంగమగునె
భవ్య దేవాలయాల్ భరత భూమిని నుండ
భారత స్వాతంత్ర్య భంగమగునె
దాన ధర్మంబులు దైవపూజలు సేయ
భారత స్వాతంత్ర్య భంగమగునె

పుణ్యపురుషు లెపుడు పురుషార్థములు కోరి
పుణ్యకృతులు సల్పపుణ్యభూమి
దేశరక్షణంబు దేశశాంతియు గల్గె
దివిజ కరుణవలన దివ్య జయమె – 2

భారత జలధిలో భవ్య విష్ణువె యుండ,

కలకత్త నగరాన, కాళిగొల్వ
కాశీవిశాలాక్షి కాశీ పతిఁగొల్వ
వేంకటాచల మందు విష్ణుగొల్వ
దివ్యతీర్థములందు దివిజులఁ బూజింప
కనక దుర్గను గొల్వ ఘనముగాను
గంగాది నదులలో జ్ఞానభక్తుల్ గ్రుంక
దైవకరుణ కల్గె తథ్యముగను

దుష్ట జనుల నణచి దూరంబుగా ద్రోయు
శిష్ట జనని ! నీదు చిత్తమందు
శాంతి సహనములును జక్కగా నుండు, నీ
శూరధీర సుతులు శుద్ధమతులు – 3

గ్రామ పట్టణముల గల దేవతల్ నీదు
కీర్తి చాటుచు నుంద్రు కేకవేసి
ధైర్య సాహస వీర్యధనులైన, నీ సుతుల్
సైనికాగ్ర సరులు సమరమందు
సర్వశక్తులజూప సకల దేవతలును
తోడ్పడుచుందురు దుష్టవధకు
విశ్వాన నీ కీర్తి వెలయ జేసిరి సుతుల్
జయమును సాధించి జగము పొగడ

ఝాన్సి లక్ష్మీబాయి సాహసంబును జూపి
భరత మాతృయశము భద్రపఱిచె
రుద్రమాంబ కూడ రోషంబు జూపింప
భరతమాతృకీర్తి ప్రజ్వరిల్లె 4

పాకు పాలకు లెప్డు పాడుబుద్ధిని జూపి
మన దేశ సంపదమంట గల్ప
మదమత్సరంబుల మానవ హింసను
క్రూరులే చేసిరి కుజనుల వని
పాపులైన విభులు ప్రజల హింసింతురు

పాకు నాయకులెల్ల పట్టు పట్టి
బంగళావాసులన్ బహుబాధలను బెట్ట
ఇందిరమ్మ మనసు నెంతొ యుడికి
బంగళా స్వాతంత్ర్య భవ్య రణంబుకై
ఇందిర సైన్యంబు లిట్టె అంపె
అమెరికా చైనాలె, యాడిపోయుచు నున్న
కాళియై, దుర్గయై ఘనత జూపి
విజయంబు సాధించె విశ్వంబు కొనియాడ
బంగళా ప్రజలకు భాగ్యమొసగె
బంగళా దేశంబు బాలించు రహమాను
ఇందిరమ్మ ఘనత నినుమడింప

బంగళ జనులింక బహుధర్మ నిరతులై
సత్య ధర్మశాంతి సడలకుండ
భరత దేశ జనుల భ్రాతృభావము తోడ
గౌరవించుచుండ ఘనులు కారె 5

★★★

## 7. 'ప్రజారథం'

ప్రపంచమందలి – పౌరులొక్కటని
ప్రపంచ శాంతియె – పురుషార్థంబని
స్వార్థం వీడిన – స్వర్గమిదేయని
అర్థం తెలుపుచు – ఆచరింపుమని
అక్షరాస్యతే – ఐశ్వర్య ప్రదమని
ప్రబోధ చేసే ప్రజారథం ॥

సంఘాభ్యుదయం – సాధించాలని
విజ్ఞానాన్ని – విరజిమ్మాలని
వినూత్న తేజం – వర్ధిల్లాలని

నవ సమాజం – నిర్మించాలని
అక్షరాస్యతే – ఆనంద ప్రదమని
ప్రబోధ చేసే – ప్రజారథం॥

పేదలు ధనికులు – భేదం వద్దని
తెలుపూ, నలుపూ – తేడా వద్దని
నవజీవనము – సమభావనము
జాతి జీవితం – జయప్రదంబని
అక్షరాస్యతే – సుఖప్రదంబని
ప్రబోధ చేసే – ప్రజారథం ॥

మనిషికి మనిషికి – తేడా లేదని
మానవ శక్తియె – మలచును సృష్టిని
మనుజుడె మూలం – విశ్వశాంతికని
మంచి మార్గమున – మసలగ – మనుజుడు
అక్షరాస్యతే – శాంతి ప్రదమని
ప్రబోధ చేసే – ప్రజారథం॥

(మాస పత్రిక సంపాదకుడు – శ్రీ బాష్మం శ్రీరామమూర్తి, విశాఖపట్నం.)

★★★

## 8. 'బంగారు పాపాయి'

బంగారు పాపాయి – బంగురుచు, రమ్ము
సింగారముగ నీవు – సిరుల చేకొమ్ము ॥బం॥

ముక్కోటి ఆంధ్రులకు – ముద్దుబిడ్డవు, కమ్ము
అక్కచెల్లెళ్లలో – అందకత్తెవు, నమ్ము
పాప పుట్టిన చోట – బంగారు కోట
పాప తిరిగిన, నేల – బంగారు కోట ॥బం॥

భారతీ దీవనల – బడయుదువు నీవె
భారతావనియందు – భాసింతు వీవె
గంధర్వ బాలవలె – గానమ్ము చేసి

అప్సరః కాంతవలె – ఆటలాడుదువు ॥బం॥

కడుపుబ్బ నవ్వించు – కవ్వించు పాప
రసవంతమగు మాట – రత్నాల మూట
హద్దు మీరకు మమ్మ – అందాల రాణి
ముద్దుగను, ఒజ్జవలె – పల్కు నీతులను ॥బం॥

(మాస పత్రిక సంపాదకుడు – శ్రీ రావికోండలరావు, శ్రీకాకుళం)

## 9. 'విశాఖ ఉక్కు - ఆంధ్రుల హక్కు' - 'తెన్నేటి'

సీ.మా. విశ్వనాథ ! నిఖిల వేద వేదాంతాది
విద్య లెరిగినట్టి వినయధనుడ !
తెన్నేటి వంశంబు దివ్యకీర్తిని గాంచె
నీతి యుతు డవౌట నిర్మలాత్మ !
స్వార్థరహిత ! నీవు స్వాతంత్ర్య సమరాన
యోధుడ వయితివో, యోగివర్య !
గాంధీజి మొదలైన ఘన నాయకులు గూడ
సన్నుతించిరి నిన్ను సాధుజనుడ !
న్యాయశాస్త్ర విదుడ ! న్యాయంబు తప్పక
మసలితి వెల్లప్డు మానధనుడ!
ఆంధ్ర కేసరి మెప్పు నందినధీశాలి
దివ్యశక్తి యుతుడ ! దేశభక్త
కోటికారాధ్యుఁడ ! కోవిదుల్ కొనియాడ
శాసన సభలందు శాస్త్ర బద్ధ
చర్చలు సల్పుచు, చట్టముల్ చేయించి
మంత్రివర్యుడ వైతి, మాన్య చరిత !
ప్రతిపక్షమందుండి ప్రతిభతో, లోక్‌సభ
యందలి వాదములందు నీవె
విజయము సాధించి, విఖ్యాతి గాంచగా
వేనోళ్ల బొగడిరి విశ్వజనులు
సాహిత్య వేత్తవు సద్గ్రంథ కర్తవు
సచ్ఛీలవంతుడౌ శాంతమూర్తి!

శాంత్యాశ్రమంబును సర్వవిధంబుల
నభివృద్ధి చేసితి న్యాయమూర్తి!
ఆనాడు పురపాలకాధ్యక్ష పదవిని
చేపట్టి చేసితి, సేవ ప్రజకు
ఉత్తమ పౌరుఁడ వుక్కు ఫాక్టరిగూడ
నెలకొల్పితివి కదా ! నేర్పుతోడ
నీ విగ్రహంబులె, నీ నిజాయితి కిప్డు
నిలిచి చిహ్నముగను, నీతిగఱపు,
నేతలెందఱొ యవినీతి పాలగుచుండ;
నిలువ లేకున్నారు, నీతిపరులు.
దేశభక్తి కలద ! దేశ పాలకులకు
దేశ సేవను జేయ దీక్షకలద ?

కన్ను మూసితీవు కడు ధన్యుడవయితి
ఓటు విలువ తెలిసి, ఓటు వేయ
ఓటరు సుఖశాంతు లొందగలడుగాని
ఎన్నిక ఫలితాల నెవ్వ డెఱుగు ॥

★★★

## 10. గోదావరి!

(1958)

పరమ పావని రమ్ము – గోదావరి!
పాడి పంటల నిమ్ము – గోదావరి!

గలగల రవముతో – గోదావరి!
జలజల ప్రవహించు – గోదావరి!
కలలు నిజమని చెప్పు – గోదావరి! ॥పర॥

కనులు కాయలు కాచె – కష్ట జీవులకు
పని పాటులే లేవు – పేదవారలకు
పాడి పంటలు లేవు – బడుగు రైతులకు

మంచి నీరే లేదు – మా పట్నమునకు ॥పర॥

విశాఖ జిల్లాకు – వేంచేయుమమ్మ
నీ శాఖలను పంపు – మూలమూలకు
సస్యాల పెంచెడి – సస్యదేవతవు
పశువుల పోషించు – పరమ పావనివి ॥పర॥

పెద్ద కాలువలందు – ప్రవహింపు మమ్మ
ఎద్దడి మా కొద్దు – నీటి కిటుపైని
పెద్ద యంత్రాలకు – పంపుల నీరు
పెద్ద గ్రామాలకు – పంట కాలువలు ॥పర॥

సింధియా వారెల్ల – సేవింతు రమ్మ
కోరమాండలువారు – కొలుతురు, నిన్ను

పోర్టు వారందరు – పొగడుదురు, నిన్ను
విశ్వవిద్యాలయం – వినుతించునమ్మ ॥పర॥

★★★

## 11. ఎన్నిక బాజా

(1957)

బజాయించరా – ఎన్ని బాజా
మజా చాటుతూ – ఓట్లకోసమై ॥బజా॥

నీ వూరేదో – నీ పేరేదో – ఎరుగకున్నను –
ఓట్లిస్తారులె – వారి మేలుకై ।
నీ తాతలందరు – నేతులు తాగేరు
నీ మూతిప్పుడు – వాసన – చూపర ।
చదువులు, సందెలు – నేర్వకున్నను –
చక్కగ గద్దె – ఎక్కగలనను ।
కూటికి, గుడ్డకు – లోటు కలిగిన –
పేదల పిలువుము – ఆదరమ్ముతో ॥బజా॥

నూతులు చెరువులు – త్రవ్విస్తానని
రోడ్లు, వంతెనల్ – కట్టిస్తానని।
నీతికి, నిజముకు – తావేలేదని –
మోసముతోనే, లోకమున్నదని।
నా కంటే, ఇక ఘనుడే, లేడని –
నన్ను ఎన్నుకొని – సుఖింపుడంటూ।
భాగ్యవంతులే, బీదలగుదురని –
భారత జాతి – ఖ్యాతి చెందునని ॥బజా॥

నీ వెంట తిరిగే పెద్దమనుషులకు –
నోట్ల కట్టలు పంచిపెట్టినా –
నీకే మోసం, చేయకుండగా–
ఉద్యోగాలు – కాల్వ భూములు
ఇప్పిస్తానని – ఆఫీసులన్నీ – నీ వశమేనని
నందిని పందిగ మార్పిస్తానని
మానవులందరు – ఒక్కటేనని –
రామ రాజ్యము స్థాపిస్తానను ॥బజా॥

చెప్పులు, రాళ్లు మీద పడినను – సాగిపోవనీ, ఉపన్యాసములు
తప్పులు, పట్టక – చప్పట్లు – చరతురు – ఓటర్లందరు, నీవారైతే
ఓటర్లందరు, నీవారగుటకు– ముందుగ, వెదకుము, కొత్త పద్ధతులు
ద్రోహి 'దేశద్రోహి' అని పిలువరులే –
కులమత తత్వాల్, వినియోగించకు ॥బజా॥

★★★

## 12. ఎన్నిక

(1957)

ఎన్నికైన పెద్దమనిషి – ఏం చేస్తాడా?
పన్నులెన్నో, ప్రజల పైని – పులుముతుంటాడు ॥ఎన్ని॥

దేశమెల్ల దోచుకునే – ద్రోహులున్నారా?
కులమతము, వారమని – గొంతు కోస్తారా?

తెలివి లేని నాయకులు – తెగులు, జాతికి ।
దేశ స్వాతంత్ర్యానికి – త్యాగం చేసారా? ॥ఎన్ని॥

కష్టమంతా ప్రజలదైతే।
తుష్టి, పుష్టి – నాయకులదే
దేశమెట్లు – బాగుపడును
దేశభక్తి – శూన్యమైతె ॥ఎన్ని॥

## 13. మా పాప!

(మే 1955)

లేవోయి లేవోయి – మా పాప!
రావోయి, రావోయి – మా పాప! ॥లే॥

మాటలాడాలోయి – మా పాప
మాటలాడితె – మధువు లొలకాలి
పాట పాడాలోయి – మా పాప
పాట పాడితె – పాము లాడాలి ॥లే॥

ఆటలాడాలోయ్ – మా పాప!
ఆటలాడితె – హరుడు మెచ్చాలి
నవ్వు నవ్వాలోయి – మా పాప!
నవ్వు నవ్వితె, మల్లె – పూలు రాలాలి ॥లే॥

పిల్లలతో, మసలినా – పినవాడా!
చిలిపి పన్లొద్దోయ్ – చినవాడా!
చదువు నేర్పెద నీకు – చినబాబు
చక్కగా, మెలగాలి – చినబాబు ॥లే॥

పెద్దలతో, తిరుగుచు – పెద్దబాబూ
పేరు గడించుకో – పెదబాబూ
గురువులను సేవించు – గుణశీలి
కవివర ! కావ్యాలు – రాయాలి ॥లే॥

దేశాలు తిరుగుచు – ధీశాలి
దీనులను బ్రోవుమా – దయశాలి
భారతీయుడవోయి – భయహారి
భాగ్యాలు పంచాలి – ఉపకారి ॥లే॥

బోసి తాతకు – పూజ చేయాలి
బోసు మామను – అనుసరించాలి
దేశాల నీకీర్తి – నిలపాలి
ధీర జవహరు – సాటి రావాలి॥ ॥లే॥

## 14. చిన్నిపాప

(1956)

చిందులు, తొక్కుచు – చిన్నిపాప
అందెలు, గజ్జెలు – ఘల్లు మనగ ॥చిం॥

రంగు రంగుల – పూలమాలల్
ముంగటి జుత్తుకు – ముడి వేతున్

నీ మోమె, చంద్రుడు – నీ నగవె, వెన్నెల
మా ముద్దు చిలక – మంచి పలుకు పలకవె ॥చిం॥

రాజహంస – యానము
గజరాజు – గమనము
కోకిల – గానము
మయూర – నాట్యము
ముదముగా, చూపవె–ముద్దుపాప,
డెందం పొందగా – ఆనందం ॥చిం॥

నీ వాక్కులో – వాణియు
కరములో – సిరియును
నిత్యము – వసింపగ
సత్యదేవు – వేడుదున్ ॥చిం॥

★★★

## 15. నా బాబు

(1956)

లేరా రారా – నా బాబు!
రామ రామ – అను బాబు! ॥లేరా॥

రాముడు జగములు – సృజియించెన్
రాముడు అంతట – వ్యాపించెన్
రాముడు అన్నిట – నిండియుండెన్
రాముడు మనలను – పోషించున్ ॥లేరా॥

రాముని విడిచి – ఉండలేము
రాముని భజన – సేయుదము
రాముని మనము – చూచెదము
రాముని తప్పక కలియుదుము ॥లేరా॥

రాముని ఆజ్ఞ చేతనె – చీమ కూడ – కదలు చుండున్
రాముని ఆశ్రయించిన – కాచును భక్తుల – నెల్లపుడున్
రాముని తూలనాడిన – వచ్చును – కష్టాలెప్పుడున్
రాముని ఇచ్ఛ చేతనే – జగములు అంతమొందును ॥లేరా॥

★★★

## 16. అల్లరి పిల్లడు

(1956)

అల్లరల్లరి – పిల్లవాడా !
ఎల్లరు నిన్ను – మెచ్చుతారా ॥అల్ల॥

కల్లకపటం – లేనివాడవ్
మెల్లమెల్లగ – చేరుతావు

తాత పిలక – లాగుతావు
పాతర వెనుక – దాగుతావు ॥అల్ల॥

ఆడ పిల్లలు – ఆడుతుంటే
బాలకృష్ణుడ – వౌతావు
చెంగు చెంగుకు – ముడివేస్తావ్
చెంగు చెంగున – గెంతిస్తావ్ ॥అల్లు॥

అమ్మమ్మ వెనుక – చేరుతావు
కమ్మకు, కొంగుకు – ముడి పెడతావ్
మామను, ముద్దుగ – రప్పిస్తావ్
మామను, ఫూల్ని – చేసేస్తావ్ ॥అల్లు॥

అబ్బాయిలతో – ఆడుతావు
గబ్బున, ఒకణ్ణి – త్రోసేస్తావ్
అబ్బచే, దెబ్బలు – తింటావ్‌లే
దబ్బున, వస్తే – దాస్తాన్లే ॥అల్లు॥

నాన్న పర్సు – తీసేస్తావ్ –
కొన్ని డబ్బులు – నాకిస్తావ్
వద్దంటే – ఏడుస్తావ్
ముద్దుగ, నాన్నని – మరిపిస్తావ్ ॥అల్లు॥

★★★

## 17. మొద్దబ్బాయి

(1956)

మొద్దబ్బాయి – వాడేను
గుద్దులు, చాల – గుద్దేను ॥మొ॥

పిల్ల లందర్ని – మొత్తును
అల్లరి పెట్టి – చంపును
పెద్ద లందరు – కూడుదురు
మొద్దబ్బాయిని – కొట్టుదురు ॥మొ॥

ఇంటి పట్టున – ఉండదు
ఇంటి గుట్టును – ఉంచదు
ఇంటి వస్తువులు – అమ్మును
ఒంటిని, గట్టి – పర్తురు ॥మొ॥

బడికి, వేళకు – వెళ్లదు
బడిలో, పాఠాల్ – నేర్వదు
బడిలో, పుస్తకాల్ – దాచును
బడిలో, గుంజీల్ – తీయును ॥మొ॥

అమ్మాయిలను – పిల్చును
మెమ్మెమ్మె, అని – వెక్కిరించు
అమ్మలక్కలు – చేరతారు
కమ్మకమ్మగ – తిడతారు ॥మొ॥

చదువు లేవి – రాకను
చల్దికి తిండి – లేకను
బాధ లెన్నో – పడతాడు
మొద్దబ్బాయిని – తిడతారు ॥మొ॥

★★★

## 18. బోగి పళ్లు

(1956)

బోగి పళ్లు పాపకు – పోసేరు!
భోగివి కమ్మని – దీవన చేసేరు ॥బోగి॥

చిట్టి పాపడు – చుక్కల రేడమ్మ
పుట్టి నింటికి – పున్నమ వెలుగమ్మ
పూల తీగెతో – ఆసన మల్లేరు

పాల వెల్లికి – పువ్వులు కట్టేరు ॥బోగి॥

అవ్వలు పిల్లలు – అందరు వచ్చారు
నవ్వుల బాబును – నేర్పుగ పిల్చారు
పిల్లల తల్లులు – పొంగుచు చేరారు
అల్లరి యెరుగని – అయ్యను చూచారు ॥బోగి॥

అందరి ఆటలు – పాటలతో, తాను
అందాల రాజు – ఆసన మెక్కాడు
ఎల్లర చూపుల – గారవించాడు
ఎల్లరు మెచ్చగ – ఠీవిని చూపాడు ॥బోగి॥

తలపై పోయగ – బోగి పండ్లను
పిల్లల వద్దకు – వాటిని చిమ్మేదు
పేరంటాండ్ర – హారతి గైకొనెను
పేరు నిల్పుమన – అమ్మను చేకొనెను ॥బోగి॥

★★★

## 19. సంక్రాంతి

(1975)

మకర సంక్రమణ ప్రభావం
ఉత్తరాయణ – పుణ్యకాలం
ఇహ పరంబుల – నిచ్చు మాసం
పుణ్య మాసంబే.

ఈతి బాధలు – ఎన్ని కలిగిన
పంట లన్నియు – పండగానే
భద్రపరతురు – పంట కాపులు
భద్ర మతు లౌటన్

పల్లె సీమలు – పట్టణంబులు
ప్రకృతి శోభను – ప్రజలు గాంచియె

ఘనముగా – సంక్రాంతి పండుగ
చేసి కొంటారే ।

మేలుకొలుపులు – పాడ, దాసులు
శంఖనాదము – చేయ, జంగాల్
రంగవల్లులు – తీర్తురంగన
లంద మొలుకంగన్.

బాలికల్ – వాకిళ్లలోనే
గురుతుగా – గొబ్బిళ్లు తీర్తురు
నాట్యమాడుచు – నల్గురెదుటన్
గాన సహితముగాన్

రంగురంగుల – అలంకారాల్
గంగి రెద్దులు – ఘనత చూపగ
దండముల్ పెట్టింతు రయ్యల
మెప్పు పొందుటకున్

మోటు మనుషులు – తోట దొడ్డు
గొర్రె పందేల్ – కోడి పందేల్
వేయుచుందురు – వేడుకలకై
ప్రాణి హింసదియే

పండితులు – పామరులు – సైతం
దండిగా – దానాలు – ఇత్తురు
దివిని చేరిన – తాతతండ్రుల
దీవనలు – పొందన్ ।

మూడు దినములు – ముచ్చటగ తమ
యింట పండుగ – గడుపు కొనగా
క్రొత్త యల్లుడు – వచ్చి మామకు
మేకు అవుతాడే.

సూటు బూటులు – హేటు బటువులు

మోటుగా, మో – మాట పడకనె
మామ నడుగును – జామాత, దశమ
గ్రహము కావుననే.

ముద్దు మరదలు–ముచ్చటించిన
పంచభక్ష్యము – లత్త పెట్టిన
ఓర చూపుల – నాలి చూసిన
అలుక మానదుగా

అలుక మాన్పగ – నత్తమామలు
అల్లునికి అవి – యిత్తుమనగా
చిలుక పలుకులు – పలుకు నాతడు
నాలితో నపుడే

పౌష్య లక్ష్మి – ప్రసన్నురాలౌ
రంగురంగుల – పూలు కోకలు
దాల్చి పడతులు – పసుపు కుంకుమ
పంచ నింటింటన్.

★★★

## 20. బక్క మనిషి

(1971)

ఆ.వె. ఎవడొ ! యెటకు బోవ నిచ్చగించిన వాడొ!
యెట్టివాడొ! యెరుగ మెవరివాడొ!
అడుగడుగున దొట్రు పడి యంఘ్రులల్లాడ,
నతని కాళ్ల శక్తి, యంతరించె.

కాళ్లు చూడ సన్నగా నుండె తీవెలై
అతని కడుపు వెన్ను నంటియుండె;
కన్ను గవయు లోతుగాజొచ్చుకొనిపోయె;
ముడుత లతని దేహమును వరించె.

కన్నులున్న నవ్వి కనగలవో లేవొ!
చెవులు చప్పుడు వినజెల్లవేమొ!
కండలేని యతని కరములు పుల్లలు;
కలదు ప్రాణమింక కంఠ మందు.

తలయు ముగ్గు బుట్ట తమవానిగా సుంత
తలచు వారు కూడదనకు లేరొ!
తలకుదగనిబరువు తామోయు నట్లుండె
వెలువడదకట! యొక పలుకు నోట.

మూసియున్న చింకి మసిపాత తనగోచి;
అతని నగ్న కాయమంతవణకె;
ఎముక లెల్ల కొరుకు నీదర గాలిలో
నింత బట్టయైన నీయ డెవడు.

దారిబోవువారు దయతోడజూడరు;
అతని దేహమెల్ల యటమటింప
నిండ్ల నున్నవార లెట్టులాతని వెత
నెఱుగ గలరు కరుణ నెన్నడేని.

పెదవు లెండినట్టి పేదవానినిజూచి
ప్రీతిజూడడొక్క దాతయైన;
కడుపు కోతబెట్టు కఱకు టాకలి రేగి
యతని ప్రేవులందు నరవసాగె

మూగ బాధతోడ ముసలియైన యతండు
చలికి నొడలు కొంకరులును దేర,
బరువు బరువుగాను బయనింప సాగెను,
భయదమయిన శీతవాతములను.

అడుగు ముందుకు పడక యాయాసమున బక్క
యైన యాదరిద్రుడవనిపైని
సోలితూలిపడియె, శుష్కించిపోయిన
కాయమందు జీవకళ నశింప.

ప్రక్క నొక్క ముసలి పడతి పోవుచు వాని
పాటుగాంచి కనులబ్రమ్ము కొన గ
నశ్రుధార; యతనియంతికమ్మును జేరి
ఆప్తురాలు వోలె నార్తిజెందె.

అతని శుష్కవదనమందునావంతయుఁ
జలన సహిత జీవ సంజ్ఞ కాన
బడదు వృద్ధురాలు భయ కంపిత యగుచు
గోడు చెంది యిట్లు గోలపెట్టె

' అస్వతంత్రుడయ్యు, ఆనాడు, నాయక
వర్గ ముఖ్యుడగుచు భరత దేశ
దాస్యముక్తికితడు త్యాగమ్ము చేసి, స
త్యాగ్రహమ్ము సమరమందు పోరె.

తనకు నున్నదెల్ల తడయక, యలనాఁడు
పేదలకును బంచిపెట్టె; ఇట్టు
లిపుడు కమికెడన్న మేనియు దనపొట్ట
నింపలేక తూలి నేల వ్రాలె.

కట్టు బట్ట నొకటి కలవార లిన్నాళ్లు
నీయకున్న మానె, నిప్పు డితనిఁ
గాల్పనొక్క టయిన కట్టెను తెగువతో
దాన మొసగగలరె దయ తలంచి

ఎంద ఆెందఆొ యిటనీ దారి వెంబడి
ధనిక నాయకులును దాతలన్న
పేరుమోసి నట్టివారును వచ్చుచు
పోవుచుండి రంతె; ముట్టరితని.

ఇదియె యౌనొకొ మనమిన్నాళ్లు కోరిన
రమ్యమగు స్వతంత్ర రామరాజ్య
మిదియె, యౌనొకొ మనమిన్నాళ్లు వలచిన

నిర్మల ప్రశాంత ధర్మపథము.

ఇట్టి పుడమి మీద నీతండు పుట్టి యీ
పుడమి పైనె యిటుల మడిసె నేడు
పుడమి నుండి పుట్టి పుడమిలో గలిసెదు
నంచుఁవగచె వృద్ధురాలు మిగుల.

★★★

## 21. మధూకరం

ఓయమ్మా – మాయమ్మా !
మధూకరం – పెట్టమ్మా !

ఆలసించి – పెట్టినా
నా అసువులే –పోవునమ్మ
దిక్కులేని – దీనురాల
వయసయ్యిన – వృద్ధురాల ॥ఓ॥

కడుపులోన – మంటమ్మ
కనికరించు – మోయమ్మ !
ఎన్ని గడప – లెక్కినా
ఎవ్వరూ – ననుచూడరే ॥ఓ॥

బక్కచిక్కి – యున్నదాన్ని
ఒక్క ముద్ద – పెట్టమ్మా
కదలలేను – మెదల లేను
నేలపైని – రాలుతునా ॥ఓ॥

ఆగర్భ–శ్రీమంతులు
ఆలకించరే – మా మొర
భారత భూమిని – పేదకు
పట్టె డన్నమే – లేదా! ॥ఓ॥

★★★

## 22. ప్రేమ సమాజం

ప్రేమ మయమే – జగమమ్మా!
ప్రేమ రూపుడే – దేవుడు సుమ్మా! ॥ప్రేమ॥

దానము సేయుము – ఈ దీనులకు
తనువుల నిత్యము – ఈ జీవులకు
కన్నవారు లేరీ – అనాథలకు
కనికరమేదీ – కలవారలకు ॥ప్రేమ॥

ప్రేమ లేనిచో – ఈ జగమేల
రామ రాజ్యములో – బీదలి కేల
ప్రేమ చూపని – జీవితమేల
రామ రామ – మము కావరికేల

ప్రేమయే – జనులకు – సుఖప్రదము
ప్రేమ సమాజము – దేవాలయము
జీవుడే దేవుడు – తెలిసిన వారికి;
ప్రేమతో పేదల – సేవ చేయుము ॥ప్రేమ॥

★★★

## 23. లాగుడు బండి

బ్రతుకు తెరువుకు – బండి కావాలోయ్
మెతుకు, కోసం – బండి లాగాలోయ్॥

బస్తాల బరువుతో – బండి విరుగుతాదొ
బస్తాలు పైబడితె – గుండె, ఆగుతాదొ
వస్తాదు లైనా, ఈ బస్తాల్ – మొయ్యలేర్
వేస్తాడు, కర్రతో – బస్తా చిరిగితే, శెట్టి ॥బ్ర॥

పొద్దల్ల లాగితే – బండి

ముద్దకే దొరుకు – నమ్మండి
ఎద్దుల్లా – పనిచేస్తాము
కుద్దుగా – కూర్చో – లేము

బండిని నెట్టిస్తె – బస్సు
బండి – ఢీకొంటే – బండిని
బండి, లాగేవాడెక్కడుండును
బండి, వాళ్ల గతి – ఇటులుండును ॥బ్రా॥

స్వారాజ్యం – వచ్చింది – నాడు
మారాత – మారుటే – నాడు ?
ఆరాటమే – మిగులును – నేడు ॥బ్రా॥

★★★

## 24. రిక్షా

(1956)

ఒడలు పీకిన – మేము – తొక్కాలి – రిక్షా
కూడు దొరకదు – మాకు – వదలితే – రిక్షా ॥ఒ॥

కూలి బ్రతుకే – మా కులము వారలకు
కాలము మారినా – కరువు పోయిన – మాకు
కూడు గుడ్డల కెపుడు – లోటు పోలేదు
ఏడాది కొక రోజు – విశ్రాంతి లేదు ॥ఒ॥

అద్దె డబ్బులు మాకు – దొరక వొకరోజు
అద్దె కట్టిన తిండి – ఉండదొకరోజు
పెద్దబాబులు – సైతమెక్కితే – రిక్షా
పెద్ద బేరంతోనె – దొరకునో – రక్ష ॥ఒ॥

పిసనారి బేరంతో – పిచ్చెత్తు మాకు
పైస రానట్టి వట్టిమోత – చీకాకు

విసవిసలు – పడ – ఇంట్లో – బత్తెము – లేక
ఎసరు చల్లారును – బియ్యమే – లేక ॥ఓ॥

కాయ కష్టంతోనె – గడచు – కాలం – మాకు
ప్రాయము – మళ్లినా – పాట్లు – తప్పవు – మాకు
పట్టెడు మెతుకులకు – పాకులాడుదుము
కట్టె నీడ్చుచునే – తొక్కాలి – రిక్షా ॥ఓ॥

★★★

## 25. మానవతి

(1971)

మావి చివురుల తినుచు కుహూయని
కోయిలలు, మధురముగ కూయగ
చెట్టు చెట్టున శ్రుతులు కలుపుచు
పిట్ట లార్చె కలధ్వనుల్.

పిల్లగాలులు – పూలగంధము
కొల్లగొట్టుచు – మెల్లమెల్లగ
పల్లె సీమల – చిందు ద్రొక్కెను
పరవశింప జనుల్.

నింగి నిండుగ – రేయి యెల్లను
తొంగి చూచిన – చుక్క లన్నియు
సురిగి పోయెను – తూర్పు దిక్కున
అరుణ రుచి – విరియన్.

ఊరి వెలుపల – పూరి గుడిసెను
ఒంటిగా తన జీవితమ్మును
గడుపు చుండెను – పేదయగు నొక
కన్నెపడుచచటన్.

పగటి వేళను – కష్టపడుచును
దిగులుతో కనుమూసి రాత్రులు

మరల మఱు వేకువను పనికై
మగువ యేతెంచున్.

నేడు కూడ విభాతమున పూ
బోడి నిద్దుర లేచి బయటకు
నడచె, వంపులు సొంపులును తన
యొడల దళు కొత్తన్.

వయసువచ్చిన వన్నెలాడి, ప్ర
భాతమున నటు లేగుచుండగ
దారి పొడుగున, నవ వసంతము
వచ్చు గతి తోచెన్.

ఆమె నడకల లోని – కులుకుల–
ఆమె చూపులలోని – తళుకుల –
ఆమె హాసములోని – మెఱపుల –
అమృతమే యొలుకున్

పేద యయ్యును – పసిడి కాంతులు
మేదు రమ్ముగ ఆమె మేనను
వెల్లి విరిసెను – పల్లె సీమయె
ఉల్లసము చెందన్

కడుపు నింపగ లేక, పస్తులు
పడెను, ఆ సొగసైన పెదవుల
చిలుకరించెడు – నగవులను, వె
న్నెలలు పూయు సదా

హొయలుతో, చిర్నగవుతో, తన
వయసులోని బెడంగు చూపుచు
కన్నె ఆ సమయమ్మునన్, క్రొ
క్కారు మెఱుగువలెన్

నడవ సాగెను తోటవైపున
నడకలో రాయంచ బోలుచు,
పడుచు పిల్లను జూచి యొక్కడు
పరవశుండగుచున్

కొంటె తలపులు – గుండె లోపల
కుటిలముగ నర్తింప, కన్నుల
యందు తృష్ణ చలింపగా, కా
మాతురుండగుచున్

ముద్దుగుమ్మను చూసి మోహపు
సుద్దులను తాపలుక సాగెను;
కన్నె కన్నుల కెంపు వన్నెలు
కనలుచును తొనకన్

హరిణిపై బడునట్టి వ్యాఘ్రము
కరణి నాకలుషాత్ముడక్కట!
బలిమి చేయగ బూనె, కన్నెయు
బావురని యేడ్చెన్

అతుకులును గల యామె చీరెయు
ముతక రవికయు చిరిగి పోయెను
పశువు వలెనా – పరమ మూర్ఖుడు
పట్టు విడువడు కదా

ఎంత వగచిన – నేమి లాభం !
ఎంత పెనగిన – నేమి ఫలితం ?
ఎవరు వత్తురు – తనకు సాయ
మ్మింత వేకువను

తరుణ భానుడు, ప్రాక్తటమ్మున
అరుణ రేఖలు, విరియ, నెర్రని
వదనమున, ఈ వైపు చూచెను

హృదయముడుకెత్తన్

ఉర్విపై బడియున్న కన్నియ
సర్వసాక్షిని జూచి మదిలో
గావుమంచును, వేడె తనలో
జీవ మల్లాడన్

అనాఘ్రాతమ్మయిన పుష్పము
ననుభవింపగ - వ్రాలు తుమ్మెద
వలెను మూర్ఖుం డామెపై బడె
వలపు టూర్పులతో

పక్షులన్నియు - అరవ సాగెను;
వృక్షములు చలియింపసాగెను;
దిక్కుమాలిన పక్షి, నాయమ
నాదు కొనగలవా?

లేని శక్తిని దెచ్చికొంచును
మానవతి యామగువ వానిని
ప్రక్కకును దానెట్టె నెట్టులొ
పట్టు విడిపోవన్

తుచ్ఛమగు నాతులువచలమును
హెచ్చె; ఇంకొకసారి కన్నెను
పట్టుటకు, తాప్రయత్నించెను;
రట్టు చేసె, కడున్

నిస్సహాయపు నెలత మరలను
నేల కొరిగెను శీల మిక చే
జారునని వ్యాకులిత యగుచు, వి
చారమును బొందెన్

క్షణములో తన వయసునంతయు
ననుభవింపగ నున్న ఆయధ

మాధముండొక కేక పెట్టుచు,
అవనిపై కూలెన్

పాదతలమున, నుగ్రముగ నొక
పన్నగము పడగెత్తి, విషమయ
మైన కాటును వేసియట, పొదలోని
కరిగె వడిగాన్

మూతి నురగలు క్రమ్మె; కన్నులు
మూత పడె; దేహమున చలనము
వీతమయ్యెను ; ముష్కరత్వము
ప్రేతగా మారెన్

తరుణిపై భూజములు పూలను
వరుసగా చిలికించె, సేసలు
వలె; ఖగమ్ములు సంతసముతో
వలయములు చుట్టెన్

అరుణుడై, ఉదయాద్రి పొడిచిన
తరుణ భాస్వంతుండు, తేజో
మయమ్ముగ, తన వేయి కరముల
మగువ నోదార్చెన్

★★★

## 26. యువతి

(1971)

ఆమె చక్కని చుక్క; యూయల
యందె పవడపు వన్నె పెదవుల
పసిడి గరిటెల పాలు చిందెన్
పసితనమ్మందే

ఆంగ్ల విద్యను చదువుకొన్నది
హావభావములందు వేషము

నందు నవనాగరిక చిహ్నము
లంద గిల్లె కదున్

కారులో క్లబ్బులకు పోవుచు
తీరికగ పిక్‌నిక్‌ల కేగుచు
కాలమంతయు వృథా చేయుచు
గడిపె జీవితమున్

తల్లి యామెకు లేదు, ఎన్న డో
కళ్లు మూసెను; తండ్రి మిగిలియు,
ఆమె కడ్డము చెప్ప డెన్నడు
ఆమె లోకమ్మామెదే

ధనము కల్గిన తండ్రి కూడను
ఘనముగా వ్యాపారమందలి
చింత మాత్రము తప్ప, కూతురు
శ్రేయమును గన దాత్మలో

తన విలాసము తన వినోదము
తన విహారము తనది కాగా
తరుణి యానందమ్ము కొరకై
తిరుగుచుండెను, సతతమున్

యువక యువతీ బృందములతో
నవనవోన్మిషితంపు వయసున
పగ్గములు లేనట్టి గుర్రము
వలె, విహారము చేసెడిన్

ఎన్నియో సంబంధములు తన
కన్నులకు నచ్చునివి అయ్యెను;
కన్నె, ఓథగ మార పెండిలి
నెన్న దెన్నడు నెమ్మదిన్

ఒక్క యువకుడు ప్రేమమయుడై

ఒక్కనాడా జవ్వనికి, తన
వలపు కోరిక తెలియజేసెను;
చెలువ మూర్ఖత తొలగదే!

కాని పాపమ్మతని ప్రేమయ
ఖర్వమై యెదనిండ నిచ్చలు
నిలిచిపోయెను; కన్నె నెప్పుడు
తలచుచుండ మదిన్

హాని యేమి ఘటిల్లెనో, ప్రే
యసికి, అని ఆ ప్రియుడు తలచుచు
అన్ని వేళల నామె వెన్నున
అనుసరించుచు తిరిగెడిన్

ఒక్క దివసాంతమున పార్కున
ఒంటిగా, ఆ లలన ఉండగ
అంతవరకును స్నేహితులుగా
ఆమె మన్నన లందుచున్

సంచరించిన యువకు లిద్దరు
సబలులై ఆ యబలపై బడి
మానభంగము చేయబోగా
మరుగునుండి హఠాత్తుగా

మనసు నిండుగ నామె బ్రేమిం
చిన అమాయక యువకు డప్పుడు
బలము కొద్దియు నిద్దరిని, చా
వంగ గొట్టెను ధీరుడై

దుష్ట యువకుల బారినుండి, అ
దృష్ట వశమున తన్ను కాపా
డిన అచంచల ప్రియుని గని
వాల్గనుల జూచెను కన్నెయున్

తన విహారము తన వినోదము
తప్పెయని తానొప్పుకొని తన
బ్రతుకులో భాగస్థుడుగ, దా
నతని నెంచుకొనెన్

★★★

## 27. నీళ్ల బావి

(1960)

సారవంతపు సస్యభూముల
చారుతర నవధాన్యరాసులు
పండుచుండగ భాగ్యసీమై,
పల్లె పట్టులలరారుచుండెన్

నాల్గు జాతుల వారలయ్యెడ
తెల్లువారమటంచు, ధర్మమ
ఖర్వముగ సాగింతు మనుచును
గర్వమతులయి వెలసెడిన్

పంచములుగా పాపమా విధి
వంచితులు హరిజనులు పొలి మే
రలను గుడిసెల మురికి జీవిత
ముల వసించిరి దైన్యతన్

ఆయమాయక హరిజనాళిని
మాయ చేయుచు నుండి యెల్లరు,
వారి చెమ్మటలను ఫలించిన
పంటలను గ్రహియించుచున్

తమకు వలె, ఆ యభాగ్యపు జన
సముదాయమ్మును జూడకుండిరి;
అన్నపానాదులను సమతను
హరిజనుల్ గన బోరటన్

అంటరానితనమ్ము వారని
యర్థమేలేనట్టి వాదము
తోడ బ్రాహ్మణులాదిగా జను
లాడుచుండిరి నిర్దయన్

గ్రామముననున్నట్టి వారికి
గలదు ప్రత్యేకముగ స్వాదు జ
లమ్ము సంతతమూరునొక కూ
పమ్ము చక్కని గట్టుతో

బీదలై దురదృష్ట జీవిత
మీదుచుండిన హరిజనమ్ముల
కోసమై పొలిమేర సన్నని
కుంట కలదుదకమునకై

పొలములందున కూలి చేయుచు
పురుషులుండిరి, పడతులచ్చటి
కుంటలోని జలమ్ముగొని తమ
యింట మెలగుచు నుండగా

ఎండకాలము వచ్చె కుంటయు
ఎండిపోయెను; నీటి కొఱకై
అలమటించిరి హరిజనులు సం
కటము మిక్కిలి చెందుచున్

వాడకంతకు వెలుగు గూర్చుచు
ఆడజాతికి వన్నె తెచ్చెడు
కరణి ఒక జవరాలు – హరిజన
కన్య ఆ గూడెమున చెలగెన్

అలగు సౌందర్యమున కీడుగ
తెలివి తేటలు గలది; తీయని
పలుకులను దాబలుకు వీణా
లలిత సంగీతములుగా

నీటికై కులపెద్దలటు నొక
చోట మూగుచు చర్చ చేయగ
కన్నె పిల్లయు చేరి యచ్చట,
తిన్నగా వాకొనెనిటుల్

'మాల'లని మన తెగను మిక్కిలి
తూలనాడుచు మనల నిట్టుల
బాధపెట్టెదు ప్రజలు నరులా!
బందెపోటుల నం దగున్

ఊరి వెలుపల త్రోసి, ప్రాణా
ధారమగు నీరమ్ము కరువై
పోవ, నేమియు పట్టనట్టుల
ఏవగింత్రీ జాతినే

రక్త మాంసము లన్న వారివె
భుక్తి పానములన్న వారివె
యవున; మన వర్గమ్ములకిల మా
నవతయే లోపించెనా?

వారి వలె నిటు మనము కూడను
వాయు వెల్లప్పుడును పీల్చమె?
మనము పీలిచి విడుచు గాలిని
జనము లెల్లరు పీల్చరే?

పవనమున కడ్డంకి పెట్టుట
వారి తరమా? పవనమట్టులె
నీరు సైతము ప్రాణి కవసర
మై రహించెడు జగతిలో

గాలిపై స్వాతంత్రమున్న జ
నాళి కంబువుపైని మాత్రము
స్వేచ్ఛ లేదని చెప్పు వారలు
తుచ్ఛులై లోకమ్మునన్

ఎండ దెబ్బకు కుంటయెండెను
నిండు బ్రతుకులికెట్లు గడచును
రండు గ్రామము నందు గల యా
నిండు బావికి రయమునన్

ప్రాణములు కాపాడు నీటిని
బావి లోపలి నుండి తోడిన
నేర మందుర? అడ్డు పెట్టగ
లారె దీనిని పెద్దలే?

అనుచు హరిజన వాడలోగల
యంగనల దన వెంట గొనుచును
తెలివిగల యీ పొలతి తానరు
దెంచె జలమును గొనుటకై

అంస భాగములందు భాండము
లందగిల్లగ హంసలుగ నా
పడుచు లందరు సుందరముగా
నడవ సాగిరి నీటికై

పల్లెలో గల యగ్ర కులజులు
పడతులను వీక్షించి 'మాలల
కూరియందలి బావిపై నధి
కారమా? యని రలుకతో

ఎండచే మాకున్న కుంటయు
ఎండిపోయెను ప్రాణములు నిల
బెట్టుటకు మీ బావి యొక్కటె
పట్టుకొమ్మయగున్

అనుచు హరిజన కన్య పలుకగ
ఆగ్రహించుచు 'పొందు పొండ'ని
గ్రామమందలి అగ్రకులజులు తెగ
కసిరి తిట్టిరి యువతులన్

"అయ్యలారా! అమ్మలారా!
ఆగ్రహించక నీరు తోడుట
కనుమతింపుడు; దప్పిగొనుమా
యసువులను గాపాడు డీ"

అనుచు వేడిన జవ్వనిని గని
అగ్రకులజులు పలికిరిట్టుల
'మా జలమ్ములు మీరు ముట్టిన
మైలపడి చెడిపోయెడిన్"

పొందు పొందిడి మాల కన్నెలు
ముట్టరానిది; మీకు ప్రాణము
లెగసి పోయినగాని యిచ్చట
తగుదురే యీ బావికిన్

అనగ విని యీ కన్నె యిట్లనె
'అనఘులారా! పావనమ్మగు
నీరు ముట్టిన దోషమన, మా
నేరమేమియో? చెప్పుడీ?

మీకువలె మాంసమును రక్తము
మాకు గూడను దేహమందున
లేవ? యవయవములును నెన్నగ,
మావి వేరై యున్నవా?

దేవుడందరి కొక్కమాదిరి
జీవ మిచ్చెను జీవములు కా
పాడుకొన మీ వలెనె మాకును
పరమ ధర్మముగా చనున్

పాడి పంటలు ముట్టగా, పా
పమ్ము రాదు; జలమ్ము ముట్టినన్
అఘము వచ్చునె? యెందుకీయ
న్యాయమగు సిద్ధాంతముల్?

దేశపితయగు గాంధి తాతయు
'దేశ దౌర్భాగ్యమంచును బలుకలేదా?
'మాల' పదమును మాపడా?

అనుచు కన్యక తెలివిగా, వా
దించె; అచ్చటికప్పుడొక సం
స్కరణ భావములున్న యువకుం
డరుగు దెంచె హుటాహుటిన్

విప్ర కులమున బుట్టి యాతడు
విప్రు లాగ్రామమున జేసెడు
దురంతాలకు దుఃఖితుండై
కరము తా కలత చెందున్

అతడు వచ్చి మృదూక్తులను నిటు
లనెను 'నీటికి నగ్రకులజులు,
నధమ జన్ములు ననెడి భేద
మ్మరయనయ్యది ధర్మమా?

నీరు కరువై పోవ జాతికి
వీరు వచ్చిరి నీటి నీయక
త్రోసి పుచ్చిన మీకు తీరని
దోష మది కాజాలదా?

వారు మనవలె దేహధారులు
కార ? వారికి మనసు లేదా?
మనకు గల యా దేవుడే యీ
మనుజులను గర్జించునా?

వీరు వేరని యెందుకో మన
వార లెన్నడొ అర్థరహితపు
తీరునన్ వెలివేసి యుంచిరి
వీరినేరమ్మేమి చెపుడీ?

కుల విభేదము వల్ల మనుజుల
విలువ తూకము చేయవచ్చునె
కులము కన్నను గుణము మిన్నగ
కలయ జూచుట యొప్పగున్

మును నరుంధతిం పెండ్లియాడడె
మునివతంసుండగు వసిష్ఠుడు
మునుల కన్నను మానవుల మగు
మనము శ్రేష్ఠుల మగుదుమా?

నేను తోడెద బావి నీటిని
నేను నింపెద వీరి కుండల
నేను సాయమొనర్తు వీరికి
నేర మదియని యందురా?

తెలివి తేటలు గలిగి యందపు
గళలు తనువున తొలకరించెడు
ఈ వధూటిని నావధూటిగ
నిప్పుడే చేపట్టెదన్

అనుచు నా యువకుండు యువతుల
కచట తా నిలుచుండి నీటిని
తోడి, కుండల నిండబోసెను
తోడు కాగా కన్యయున్

ఊరి పెద్దలు కూడ హరిజన
వారమును తమవారిగా మది
నెంచ దొడగిరి బావి నీటిని
పంచనిష్టము చూపుచున్

పల్లె సీమయు బాగుపడినది;
పాడిపంటలు వృద్ధిపొందెను;
కులములన్నియు, కలసి మెలసెను
కుల విభేదము తొలగగా॥

★★★

## 28. నరుడా!

నరుడా !
ఓ నరుడా!
వానరుడా!
మానవుడా!
దానవుడా!

నీకు– తనువుందా?
మనసుందా?
మతుందా?
గతుందా?

నీకు– తనువుంటే
మానవ ధర్మం – చేసావా?
మనసుంటే
మానవత్వం – చూపావా?
మతుంటే
నరులకు – శ్రేయస్సు – చేసావా?
గతుంటే –
లోకభద్రత – చేకూర్చావా?

నీలో – చలనం ఉన్నా
ఆలోచన – యంత్రం ఉన్నా
సులోచనాల – అద్దంకన్నా
ఈ లోకంలో – నీవా మిన్న?

దేహం – భోగం కోసం
విద్యలు – ఆర్జన కోసం
ఖ్యాతిని – కక్షల కోసం

విజ్ఞానం - విలయానికి
అనుభవం - అణచటానికి
ప్రకృతి - ప్రయోగాలకి
వికృతి - విషవలయాలకి
ప్రగతి - ప్రళయానికి;

ఆకృతి - అరాచకాలకి
అందం - అంధత్వానికి
సృష్టించే - స్రష్టవు నీవా?

★★★

## 29. మానవుడు - దానవుడు

మతం లేదు - గితం లేదు
కులం లేదు - గిలం లేదు
జాతి లేదు - నీతి లేదు
దేవుళ్లేదు - దెయ్యం లేదు

అంటూనే - కొందరిప్పుడు
గద్దెక్కి - హద్దుమీరి
జంకూ గొంకూ లేక
కలం చేత - పట్టగానె
కులం వాడికే - మేలు
కానివాడికే - కీడు
చేస్తారే - ధైర్యంగా ॥

మతమెందుకు - మతి ఉంటే
కులమెందుకు - గుణముంటే
జాతెందుకు - నీతుంటే
దేవుడేల - దయ ఉంటే

కులతత్వం - రక్తంతో
గూడు కట్టుకుంది - లోన;

'బుర్రకు పుట్టిన – బుద్ధులు
పుణికెలతో – పోతాయట' –

కులతత్వం – పెంచందే
గ్రూపు లీడర్ – కాగలడా ?

గ్రూపు లీడర్ కాగానే
పదవీభారంతోను
అక్రమ ఆర్జనతోను
కనరానివి – కంటాడు
వినరానివి – వింటాడు
అనరానివి – అంటాడు।

కూడనివే – చేస్తాడు
తినరానివి – తింటాడు
తాగాలని – తాగుతాడు
తాను తీసిన – గోతిలో
తానే పడి – పోతాడు ।

★★★

నల్గురు మిత్రుల్లోను
నవ్వుల – పాలౌతాడు
మనశ్శాంతి – లేకుండా
మసలుతాడు – బొమ్మలాగ
పదభ్రష్టు – డౌతాడు
పదుగురిలో – తిరగలేడు

చదువున్నా – పరువు పోయి
చవటలాగ – బ్రతుకుతాడు;

సంస్కారం – సంస్కృతి లేక
స్వార్థపరుడైనవాడు
మానవుడైనా – వాణ్ణే
దానవుడంటారు – జనులు

★★★

## 30. ఐశ్వర్యం - అందరి సొత్తు

అగ్రనాయకులు - స్వార్థం విడిచి
మారణాస్త్రాల్ - మట్టిలో కప్పి
ప్రపంచ శాంతికి - పునాది వేసి
వసుధైక ప్రభుత్వం - నెలకొల్పాలి
ప్రజా ప్రభుత్వం - స్థాపించాలి।

మనస్సుల్ని - మంచిగ మార్చి
బుద్ధుల్ని - పరిశుద్ధం చేసి
చేతలన్ని - శ్రేయస్సులకు
మాటలన్ని - మంచి పెంచుటకు
ప్రకృతి నంతా - సుఖాభివృద్ధికి
విజ్ఞాన శాస్త్రం - విశ్వశాంతికి
శాస్త్రజ్ఞుల్ని - సంపద వృద్ధికి
మానవ శక్తిని - మంచి చేయుటకు

ప్రజా శక్తిని - ప్రగతి కోసమే
అగ్రనాయకులు - వినియోగించి
ఆత్మగౌరవం - నిల్పుకోవాలి
మానవ జాతిని - రక్షించాలి
న్యాయంధర్మం - పాటించాలి
శాంతి సౌఖ్యాల్ - కల్గించాలి ॥

ప్రజలకు న్యాయం - చేకూర్చాలి
సమాన - హక్కులు - కల్పించాలి

యుద్ధ తంత్రానికి - స్వస్తి చెప్పి -

'ఐశ్వర్యం అందరి - సొత్తని'
ప్రకృతి - సంపద - అందరి హక్కని
అగ్రనాయకులు - శాసించాలి

ప్రపంచ పౌరులు – ప్రజా ప్రభుత్వం
ప్రపంచ ప్రభుత్వం – నెలకొల్పాలి
సుఖశాంతులతో – వర్ధిల్లాలి

★★★

## 31. న్యాయం

ధనవంతుల – మదాంధకారం –
బీదల – అజ్ఞాన తిమిరం ।
ధనవంతుల – విలాస భవనం
బీదల – దేశభ్రమణం ।
ధనవంతుల – భోగార్భాటం –
పేదల – రోగావేశం ।
సంపన్నుల – స్వార్థపరత్వం
పేదల – సేవాతత్త్వం
సంపన్నుల – క్రీడారంగం –
దీనుల కాశాభంగం ।
శ్రీమంతుల – స్త్రీ లోలత్వం –
దీనుల – దయాళుత్వం।
శ్రీమంతుల – వింత స్వభావం –
బీదల – సౌమ్య స్వభావం ।
భూస్వాముల – అన్యాయార్జన –
బీదల సౌఖ్య విసర్జన ।
భూస్వాముల – రోషగర్జన –
పేదల – గ్రామ విసర్జన ।
భూస్వాముల – భోగాసక్తి –
పేదల – జీవిత విరక్తి ।
అధికార్ల – ఆజ్ఞాసక్తి –
భృత్యుల – సేవాసక్తి ।

అధికార్ల - ఆగ్రహావేశం
భృత్యుల - దీనాలాపం ।
నాగరక - ప్రపంచంలో -
నానాటికి - పెరుగుతోంది ।
న్యాయానికి - తావులేదు -
అసమానత-కంతులేదు ।
ఆస్తి హక్కు - రద్దుచేసి -
ధనిక - దరిద్ర వర్గాలకు ।
తేడా తొలగించాలిక -
పేదల - బాధలు బాపి ।
న్యాయం చేకూర్చాలిక -
న్యాయం వర్ధిల్లాలిక ।

★★★

## 32. మారణాయుధాలు

జెట్టులు - మిగ్గులు - బాంబర్లు
గగనంలో - తిరుగుతున్నా
భువనంలో - శాంతి యేది?
దేశంలో - సుఖమేది?
మనుజులకు - తృప్తి ఉందా?
నరజాతికి రక్షణ ఉందా ?

★★★

సాగరాలలో - జలాంతర్గాములు
సంతతం - సంచరిస్తున్నా
జలధులకు - పరిధులు - మృగ్యం
జనుల కిపుడు - రక్షణ పూజ్యం॥

★★★

అధునాతన – శాస్త్రాల్లో
అహర్నిశలు – జరుగుతున్న
పరిశోధన – ఫలితాలే
అణుబాంబులు – వగైరాలు ॥

★★★

మీట నొక్కితే – త్రుటిలో
మసి అవుతుందొక దేశం,
పరదేశం ॥
నిర్భాగ్యపు – నిర్జన దేశం,
మట్టికూడ – మాడిపోయి
చెట్టు చేమ – పుట్టబోదు
మారణాస్త్ర – ప్రళయాగ్నికి
ఆహుతి – మానవ జాతి,
మన జాతి॥

మారణాస్త్ర – నిర్మాతలు
మానవులే – మేధావులు
తమ మేధను – తప్పుదారి
పట్టించిన – నరరూపులు
నరులో – వానరులో
దానవులో – చెప్పగలమ? ॥

★★★

విశ్వసృష్టి – నాశానికి
విశ్వశాంతి – భంగానికి
విశ్వ ప్రజల – దుఃఖానికి
దేశ దేశ – యుద్ధాలకి,

మారణాస్త్ర – నిర్మాతలె
అధునాతన – శాస్త్రజ్ఞులె

అగ్రరాజ్య – నాయకులె
కారణం – అతిదారుణం ॥

★★★

ఊహాతీత – రోగాలకు
వాతావరణం – కాలుష్యానికి
అసాధ్య రోగాలకు
నరజాతి పతనానికి

మానవ జాతి – వినాశానికి
సామూహిక – హత్యాకాండకు
భయంకర – మారణ హోమానికి –

మారణాస్త్ర – నిర్మాతలె
కారణం – అతిదారుణం

మానవ జాతి – కావాలి
మారణాస్త్రం – మాకొద్దు ॥

★★★

## 33. మూరాలి

గగనానికి – తగులుతున్న – భవనాలు
భవనాల్లో – విహరించే – జనాలు
జనాలకు – వలసినన్ని – విలాసాలు
విలాసాలకే – విదేశ యాత్రలు –

యాత్రల్లోనే – వ్యాపారాలు
వ్యాపారాల్లో – కుతంత్రాలు
స్వతంత్రాలు – పరతంత్రాలు
వింత వింత – వివాదాలు –

స్వదేశీయుల – స్వార్థాలు
దేశద్రోహుల – నినాదాలు

ప్రభుత్వాల – శాసనాలు
మారాలోయ్ – మారాలి
మన దేశీయులు – మారాలి॥

★★★

## 34. ప్రపంచ జనాభా దివసం

ప్రపంచ మంతా – ఒకటే భవనం
ప్రపంచ పౌరుల – దొకటే జాతి
– మానవ జాతి ॥ప్రపంచ॥

ఆకలి దాహం – అందరి కొకటే
పనులు, తిండి – బట్ట, గూడు
కావాలి కదా! – మానవ జాతికి
పుట్టుట, గిట్టుట – తప్పదు, మనకు ॥ప్రపంచ॥

భాషలు, వేరు – భావన, ఒకటే
మతాలు, వేరు – సారం, ఒకటే
కలహాలేల ? యుద్ధాలేల ?
కాంక్షిస్తున్నాం – శాంతి, సౌఖ్యం ॥ప్రపంచ॥

కార్మిక కర్షక – సోదరులంతా
కుటుంబ నియంత్రణ – పాటించాలి
మత మౌఢ్యాలు – విడనాడాలి
జనం పెరిగితే – జీవన మెట్లు? ॥ప్రపంచ॥

ఒకరు, ఇద్దరు – పిల్లలు ఉంటే
కుటుంబ సౌఖ్యం – కలుగును, మనకు
ప్రపంచ జనాభా – తగ్గుట ముఖ్యం
ప్రచారమంతట – సాగిద్దాము ॥ప్రపంచ॥

★★★

## 35. చుంచు బుడ్డి

చుంచుబుడ్డి – చూడరన్నా!
దాని వెలుగు చూడవమ్మా ॥చుం॥

పైని చూస్తే – మట్టి పిడత
లోన, ఇమిడేయ్ – మందులెన్నో
ఎక్కడెక్కడొ – తెచ్చేరు
బుడ్డిలో పెట్టి – కూరారు ॥చుం॥

ఎవరు చేసా – రా మట్టి బుడ్డి
ఎలాగొచ్చిం – దా సామగ్రి
బుడ్డి రూప – మేమిటి
పేలుడు సామగ్రి – ఏమిటి ? ॥చుం॥

మట్టి బుడ్డిలోంచి – పేలుడు సామగ్రి లోంచి
వచ్చే కాంతు – లేమిటన్న
దీని రహస్య – మేమిటన్న ?
పగిలింది – చుంచుబుడ్డి ॥చుం॥

చుంచుబుడ్డి – ఏమయింది
దాన్లో సామగ్రి – ఏమయింది
మంట, వెలుగు – బయటికొచ్చె
మట్టి లోనె – బుడ్డి కలిసె ॥చుం॥

చుంచు బుడ్డి – నీవొళ్లు
చుంచు బుడ్డి – లోని వెల్గు
నీ కళ్లతోనె – చూసావు
నీలోని వెలుగంతా – నువ్వే చూడాలన్న
నువ్వే చూడాలమ్మ ॥చుం॥

★★★

## 36. నరకచతుర్దశి

నరక చతుర్దశి నాడు
నరకాసురుణ్ణి కాల్చావు ॥నరక॥

నరకాసురుడి – బొమ్మ చేసి
రంగురంగుల – బట్టల్ కట్టి
అలంకరించా – వా బొమ్మనె
అందరికి చూపించి – ఆనందం పొందావు ॥నరక॥

బొమ్మెందుకు – చేసావు
బట్టెందుకు – కట్టావు
అలంకారం – చేసావె
అంతలోనె – కాల్చావె ॥నరక॥

పాపకర్మ – చేసాడని
పాపాత్ము – డయ్యాడని
నరకాసురుణ్ణి – కాల్చావు
నరుడు చేయడనా? – పాపకర్మ ॥నరక॥

మంచివార్ని – బాధిస్తాడు
నరుడు, అసురుడే – నరకాసురుడే
వాణ్ణి కూడ – బంధించి
అందరిముందు – ఏం చేస్తావ్ ॥నరక॥

నీలోనూ – ఉన్నాడు
పాపపురుషు – డున్నాడు
వాడేనా – నరకాసురుడు
జ్ఞానాగ్నితో – కాలుస్తావా ? ॥నరక॥

★★★

## 37. పటాకీలు

పటాకీలు – చేసావు
పటాకీలు – కాల్చావు॥

ఎన్ని చోట్లకు – వెళ్లావు
ఎన్ని వస్తువుల్ – తెచ్చావు
ఎంత శ్రమ – పడ్డావు
ఎంత ఖర్చు – పెట్టావు ॥పటాకీ॥

ఎన్నెన్నో – పటాకీలు
ఎన్నో పేర్ల – పటాకీలు
ఎన్నో రంగుల – పటాకీలు
ఎట్లాగ – చేశావో ॥పటాకీ॥

ఇంట్లోనే – పటాకీలు
ఎంతో బాగా – చేసావు
ఇంటి ముందర – కాల్చావు
ఎంతో, సంతసించావు ॥పటాకీ॥

పటాకీల్లో – చుంచు బుడ్డిల్లో
కూరావు, పలు రకాల – మందులు
వింత శబ్దాల్ – చేసాయి
పగిలి, వెలిగి – కాలాయి ॥పటాకీ॥

దీని తత్వమేమిటోయ్
నీలోని – కామాదులు
నిన్ను బాధ – పెడుతున్నాయ్
పటాకీల్లాగ – వాట్ని – కాల్చాలోయ్ ॥పటాకీ॥

★★★

## 38. దీపావళి

అన్నల్లారా - చూసారా
అక్కల్లారా - చూసారా

దివ్యమైన - దీపావళి
దివ్య కాంతుల - దీపావళి
ఏటేటా - దీపావళి
ఇంటింట - దీపావళి ॥అన్న॥

పల్లెల్లో - దీపావళి
పట్నాల్లో - దీపావళి
ఇంటిలో - దీపాలు
ఇంటిముందు - దీపాలు ॥అన్న॥

చిమ్మ చీకటి - పోయింది
పట్టపగలె - అయింది
లోన వెలుగు - పైని వెలుగు
దివ్య కాంతుల - దీపావళి ॥అన్న॥

చదివిన వారికి - దీపావళి
చదవని వారికి - దీపావళి
లోన దివ్వె - వెలుగుతోంది
రవిచంద్రుల - వెలుగు అదే

అన్ని జీవుల - దీపావళి
అందరిలోను - దివ్యకాంతి
జగమంతా - దివ్యకాంతి
అందరిలోను - ఆత్మకాంతి ॥అన్న॥

★★★

## 39. ఆంధ్ర విశ్వవిద్యాలయం

దివ్యాలయం - దేవాలయం।
వసుధలో - వన్నెకెక్కిన - వాణీ నిలయం ॥
మన, విశ్వవిద్యాలయం - ఆంధ్ర విశ్వవిద్యాలయం ॥

మంచి మనిషి - మన కట్టమంచి

మంచి మనీషుల - నెంచి యెంచి
నియమించాడు - నీతిమంతుడు ॥దివ్యా॥

రాధాకృష్ణ - కృషి ఫలించి
కళలకు కాణాచియైన - కళాపరిషత్ - ఈ
విశ్వకళాపరిషత్ - విశ్వఖ్యాతి గాంచింది ॥దివ్యా॥

మన జనతకు - మానవత
మన జనానికి - జాతీయత
మన యువతకు - నవత
మనకు స్వాతంత్ర్యంపై - మమత
మన దేశానికి - ఘనత
తెచ్చింది - ఈ దివ్యాలయం - విద్యాలయం
మన విశ్వవిద్యాలయం - ఆంధ్ర విశ్వవిద్యాలయం ॥దివ్యా॥

ఇది, ఉదయించిన - భాస్కర బింబం
ఇది, వికసించిన - పంకజషండం
ఇది, వెలుగుతున్న - తేజః పుంజం
దీనికి సంరక్షణ - సర్వద్వంద్వం

దీని ఆశయాలు - అమలు చేద్దాం ।
దీని ప్రగతి చూసి - గర్విద్దాం
దీని కీర్తిని - పొగడుదాం ॥దివ్యా॥

### ఆంధ్ర విశ్వకళాపరిషత్ప్రథమ కులపతి
## 40. డా. కట్టమంచి రామలింగారెడ్డి

కట్టమంచి కులాబ్ధిసోముడు
రామలింగారెడ్డి విబుధుడు
మాతృభాషానిపుణుడయ్యెను

మాన్య గురువుల ప్రేరణంబున ॥

భారతాదుల తత్త్వమెల్లను
బాల్యమందే అరసె నాతడు
ఆంగ్లభాషా కోవిదుండయి
ఆత్మబుద్ధితో అఖిల మెరిగెను

ఖండ ఖండాంతరములందున
ఖ్యాతి గాంచెఅఖండు డాతడు
రాజకీయ జ్ఞాని, చతురుడు
రాజఠీవి విరాజితుండును

కవిత్వ తత్త్వం బెల్లనారసి
'కవిత్వ తత్త్వ విచార' మనియెడి
గ్రంథరాజము ఘనుడు వ్రాసెను
సన్నుతించిరి సహృదయు లతనిని

ముగ్ధులను గావించెనాతని
'ముసలమ్మ మరణమ్మ' నెడి కావ్యము
నవ్య కవులకు మార్గదర్శక
మతని 'నవయామిని' యన్న కృతియును

'వ్యాసమంజరి' అనెడి గ్రంథము
పండితామోదంబు బడసెను
'పంచమి' అను వ్యాస సంపుటి
సద్విమర్శకు సాక్ష్యమిచ్చును

'విశ్వవిద్యాలము' నాతడు
విజ్ఞుడై స్థాపించె నిచ్చట
ఆంధ్ర జాతికి గర్వకారణ
మవని జనుల ప్రశంస నందెను

దేశదేశాంతరము లందున
ఖ్యాతిగాంచిన దేశికులనే
నియతితో నియమించె నిచ్చట
రామలింగారెడ్డి మాన్యుడు

విశ్వకళలకు నిలయమై యిది
వివిధ శాస్త్ర విభాగములతో
అధ్యయన పరిశోధనాదుల
నతని కృషిచే ఆదర్శమయ్యెను.

★★★

## 41. కళాప్రపూర్ణ డా. పురిపండా అప్పలస్వామిగారి సన్మాన సభలో సమర్పించిన గేయరత్నం.

**( డా.బి.ఆర్. అంబేడ్కర్ అసెంబ్లీ హాలు, ఆంధ్ర విశ్వకళాపరిషత్, వాల్తేరు, తే : 27-4-1980 రచన : డా. ఎం.వి. సత్యనారాయణ, ఎం.ఏ., పిహెచ్.డి. తెలుగు శాఖ, ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు.)**

పంజా – పులిపంజా – పురిపండా
యువతరానికి – అండా, దండా
తెలుగు తల్లికి – తెల్లని పూదండ ॥పంజా॥

పురాణాలకు – పుట్టిల్లు
నవీనాలకు – నట్టిల్లు
విప్లవాలకు – గట్టిల్లు ॥పంజా॥

మెదడు నిండా – మేలిమి తలపులు
ఎదనిండా – చెలిమి వలపులు
కలం నిండా – కలిమి చెణుకులు
రాతనిండా – బలిమి సొగసులు ॥పంజా॥

మనిషి – ఎలక్ట్రిక్
చూపు – మేగ్నటిక్
చేత – అటామిక్ ॥పంజా॥

గుణం లేని – కులం – విషం
మంచి లేని – మతం – మద్యం
డాబు చేసే – బాబా – గూబ
మిరకిల్ – మాయ – మోసం–అంటాడు ॥పంజా॥

ఇజాలలో – నిజం
మజాగా, చెప్తూ – మనసుమార్చే, మనీషి
కుండలాలు – ముండనాలు
గండపెండారాలు – దండగంటాడు ॥పంజా॥

వ్యాకర్తల – వెర్రి సూత్రాలు
పండితుల – చెల్లని శ్లోకాలు
ప్రజల కిప్పుడు – పనికి రావని
కలంతో, కంఠంతో – చాటే – కళాప్రపూర్ణుడు ॥పంజా॥

పులిపంజా – పురిపండా
గ్రాంథిక భాషకు – ఉరిబండ
కృత్రిమ రచనకు – గుదిబండ
వాడుక భాషకే – చేదండ ॥పంజా॥

★★★

# ప్రబోధ గేయాలు - నీతి పద్యాలు

# PRABODHA GEYAALU

**(ADULT EDUCATION SONGS)**

**&**

**NEETI PADYAALU**

**(1989)**

***By***

**Dr. M.V. SATYANARAYANA,** M.A., Ph.D.
Editor : Telugu & Sanskrit Manuscripts
Dr. V.S. Krishna Library
Andhra University
VISAKHAPATNAM - 530 003
A.P., INDIA

# ప్రబోధ గేయాలు

## "వయోజనవిద్య పాటలు"

## విషయ సూచిక

(CONTENTS)

## I

22. పోలయ్య ! పోలయ్య !
23. ఎంకన్న సదివాడు -
24. ఆడోళ్లకు పథకాలు -
25. బాలల్లార ! రారండి
26. చదువుకున్న యువకుల్లారా !
27. మహిళల్లారా !
28. సంఘ సేవకులార !
29. వెట్టిచాకిరి చేసి - వెనకబడిపోయావు
30. చదువుకోరా - సోదరా
31. చదువురాదని - మమ్ము - మోసగిస్తారు
32. చదువురాదని - మమ్ము - చవటలంటారు
33. సాగు చేయుచు - చక్కగా చదవరా
34. చదువుకుంటానమ్మ - బడికి నన్నంపవే
35. బెమ్మయ్య - బెమ్మయ్య - ఏమి రాత రాసేవయ్య
36. గుడిసె, గుడిసెకు వచ్చి - ఓటులడిగాడు
37. అందరు సుఖముగ - ఉండాలంటే
38. చదువుకుందాం - బాగు పడదాం
39. మనది - స్వతంత్ర దేశం
40. గాంధీతాతకు - జోహారు
41. చిన్ని తమ్ముడా ! లేర - ముద్దు తమ్ముడా ! రార
42. నిరక్షరాస్యత - నిర్మూలిస్తాం
43. స్వరాజ్యమొచ్చిందోయ్ - బాబు
44. ఆ ఆ లు రావయ్య - ఆదుకోవయ్య
45. కర్షకులారా ! కార్మికులారా !
46. చదువె మిత్రుడు - చదువె బంధువు
47. మేలుకోవోయ్ - వయోజనుడా!
48. ఆడపిల్లలందరం - చదువుకుందాము

49. అన్నల్లారా ! – అక్కల్లారా !
50. కష్టజీవుల్లార – కలత చెందకుడు
51. భారతీయులం – అందర మొకటే
52. భారతీయులం – గర్వించాలి (జాతి సమైక్యత)
53. చెట్టుపుట్ట – ఎక్కుతావు
54. నేర్వాలి, నేర్వాలి – అక్షరాలు నేర్వాలి
55. భారతీయుడా ! వయోజనుడా !
56. ఎవ్వరైనా – చదవవచ్చును
57. పల్లెల్లోను – పట్టణాలలో
58. ఓ చిన్నపిల్లోడా ! ఎంత చలాకి వాడా!
59. చదువుకోరా – అన్న – రైతన్నా.

## II

నీతి పద్యాలు

## III

Gist of the songs in English Prose

a) 1-28 Songs b) 29-59 Songs

By Prof. B. Parvati

## IV

Gist of the songs in Hindi Prose



## ABOUT THE AUTHOR

Parents : Sri Modekurti Seetarama Swami & Smt. Veera Lakshmi

Birth Place : Badangi, Vizianagaram (Dist.) A.P. South India.

Date of Birth : 15-12-1928

Qualifications : M.A., Ph.D. in Telugu Andhra University, Vizag.

Experience : Teaching - Telugu Departmetns in the Degree colleges (1952-57) Dictionary compilation; publication work, in Telugu Department, Andhra University - 1957 July to 31-12-1988. ADULT Education Dept. A.U. from Sept 1989. Editor : Manuscripts section Dr. V.S. Krishna Library, Andhra Unviersity / March 1993 till now.

Personal Publications : Sri Venkatachala Maahaatmyamu, Sri Jagannatha Kshetra Maahatmyamu (Telugu Prose) Andhra Chandovikaasamu Ph.D. (Thesis) in Telugu 1965. 5 Satakas in Telugu etc.

Books : Edited & Published by the Andhra University (1) Navakavita (176 Telugu Modern poetical Selections) (2) Kaavyasameekshalu (30 critical essays on old Telugu Kaavas, Vayojanavidya paatalu etc. Descriptive catalogues of Telugu & Sanskrit Manuscripts (2 vol) pub by A.U. 1999 & 2004. Deputed by the Andhra University to participate in State, National and International conferences. More than 70 Radio talks broad cast. AIR Vizag.

To be published :
1. Desabhakti (Telugu songs, etc.)
2. Daivabhakti (5 Satakams etc.)
3. Sri Panduranaga Satakamu (Telugu with English & Hindi versions)



**Prof. K.C. REDDY**
Chairman
A.P. State Council of Higher Education
Mahaveer Marg, Opp. Mahaveer Hospital
J.N.T. University Building
Hyderabad, A.P.

Date : 2-10-2004

## సమీక్ష

డా॥ ఎం.వి. సత్యనారాయణ గారు నాకు చిరపరిచితులు. వీరి పద్య గద్య గ్రంథాలు అచ్చయి ప్రచారంలో ఉన్నాయి. వైదిక సంస్కృత, ప్రాకృతాంధ్ర తమిళ, కన్నడ, ఛందస్సుల్ని తారతమ్య పద్ధతిలో పరిశీలించి రచించిన వీరి పరిశోధన గ్రంథము '–ఆంధ్రచ్ఛందో వికాసము'. దానిలోని విషయాలు పండిత కవి విమర్శకుల ప్రశంసలు పొందినందువల్లనే, ఆ గ్రంథం తెలుగు విశ్వవిద్యాలయం, (హైదరాబాద్) : ఆంధ్ర విశ్వకళా పరిషత్తు, (విశాఖపట్నం) వారిచ్చిన విరాళాలతో ముద్రింపబడడం ముదావహం.

ఈతని భక్తిముక్తి ప్రదములయిన శ్రీ వేంకటాచలమాహాత్మ్యం, శ్రీ జగన్నాథ క్షేత్రమాహాత్మ్యం వచన గ్రంథాలు. అవి సంస్కృత పురాణాల నుండి తెలుగులోనికి అనువాద గ్రంథాలయినా, సరళమయిన, సులభశైలిలో ఉన్నందున సామాన్య భక్తులకు ఉపకరిస్తున్నాయి.

డా॥ సత్యనారాయణ గారి శ్రీరామ, శ్రీ కృష్ణ, శ్రీ పాండురంగ, శ్రీ సత్యసాయి శతకాలు, శ్రీ సత్యసాయి సూక్తిముక్తావళి, వేమన శతక పద్యాల్లాగే, పాఠకులకు ప్రయోజనం చేకూరుస్తున్నాయి.

ఈ పండిత కవి సంపాదకత్వాన 'నవకవిత' – (ఆధునిక కవుల పద్యగేయ సంకలనం) కావ్య సమీక్షలు (ప్రాచీనాంధ్ర కవుల రచనలపై 30 విమర్శక వ్యాసాలు, ఆంధ్ర విశ్వకళా పరిషత్ వారిచే 'ప్రచురింపబడ్డాయి. తెలుగు శాఖలో వీరు పనిచేస్తుండగా వీరి సాహాయ్యంతో కొన్ని అమూల్యమయిన గ్రంథాలు అచ్చువేయబడ్డాయి.

డా॥ ఎం.వి. సత్యనారాయణగారు పదవీ విరమణ చేసిన పిమ్మట కూడా, ఈ విశ్వవిద్యాలయంలోని వయోజన విద్యాశాఖలో ఉద్యోగం చేస్తున్నప్పుడు రచించిన "వయోజన విద్య పాటలు" ః "మహాత్ముల జీవిత సందేశాలు" ః నిరక్షరాస్యత, దారిద్ర్య నిర్మూలనకు కృషి చేస్తున్న వారికి ప్రచారయోగ్యంగా ఉన్నాయి. ఆ తరువాత డా॥ సత్యనారాయణగారు డా.వి.యస్. కృష్ణ గ్రంథాలయంలో, 'తాళపత్ర గ్రంథ' విభాగంలో సంపాదకుడుగా నియమితులై తయారుచేసిన 1) "DESCRIPTIVE CATALOGUE OF TELUGU MANUSCRIPTS" (one Volume) 2) "DESCRIPTIVE CATALOGUE OF SANSKRIT MANUSCRIPTS" (1st Volume) ఆంధ్ర విశ్వకళాపరిషత్తు (విశాఖపట్టణం) వారిచే (1999 ః 2004) ముద్రింపబడ్డాయి.

డా॥ ఎం. వి. సత్యనారాయణగారి శ్రీ పాండురంగశతకం (103 తెలుగు సీస పద్యాలు) పండిత కవి విమర్శకుల అభిప్రాయాలతో అచ్చయినది. ఆ శతక పద్యాలే హిందీ ఆంగ్లవచనానువాదాలతో, త్వరలోనే అచ్చుకావడానికి సిద్ధంగా ఉన్నాయి. వీరి 'దేశభక్తి' (గేయ పద్య సంకలన గ్రంథం) : 'దైవభక్తి' శతక పద్య గేయ సంకలన గ్రంథం కూడా. తెలుగుః హిందీ ఆంగ్లవచనానువాదాలతో అచ్చయి సహృదయులయిన సాహిత్య ప్రియులకు అందుబాటులో ఉంటాయని ఆశిస్తున్నాను.

డా॥ సత్యనారాయణగారు రచించిన 59 ప్రబోధ గేయాలు, నీతి పద్యాలు, సరళమయిన వ్యావహారిక భాషలో ఉన్నందున, అవి ప్రచురింపబడి, రికార్డు చేసిన కేసెట్లు కూడా వయోజన విద్యా శాఖలలోని ఉద్యోగులకు, ప్రచారకులకు అందజేస్తే, విశ్వవిద్యాలయాల వారు, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలవారు ఆశించిన నూటికి నూరు శాతం అక్షరాస్యత సాధించవచ్చునని నా అభిప్రాయం.

చదువుకోవలసిన బాలబాలికలకు, యువతీ యువకులకు, వయస్సు మళ్లిన వారికి అర్థమయ్యే పదాలలో ఉపదేశాత్మకంగా పాటలు పద్యాలు, వ్యాసాలు రచించిన డా. ఎం.వి. సత్యనారాయణగారిని మనసారా అభినందిస్తున్నాను.

**క॥ చెంచురెడ్డి**

**Prof. L. Venu Gopala Reddy**
Vice - Chancellor
Andhra University

Visakhapatnam
Date : 10-1-2006

## ప్రబోధ గేయాలు

## అభిప్రాయము

డా॥ ఎం. వి. సత్యనారాయణగారు రచించిన ముద్రిత గ్రంథాలు, అముద్రిత గ్రంథాలు చదివాను.

అతని సంపాదకత్వమున 'నవకవిత' (1900–1976) లో 176 గురు కవులు రచించిన పద్యాలు, గేయాలు, మిని కవితలు కలవు. దానిని ఆంధ్ర విశ్వకళా పరిషత్తువారు 1980లో విశ్వ విద్యాలయ ప్రచురణగా ముద్రించారు.

శ్రీ సత్యనారాయణగారి సంపాదకత్వమున "కావ్య సమీక్షలు" అన్న గ్రంథంలో 30 మంది పండిత కవులు రచించిన ఆంధ్ర ప్రబంధ కవిత్వ సమీక్షలు ఉన్నాయి. దానిని ఆంధ్ర విశ్వకళా పరిషత్తు వారు 1983లో విశ్వ విద్యాలయ ప్రచురణగా అచ్చువేయించారు. కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు నిరక్షరాస్యత నిర్మూలనకై ఎంత కృషిచేస్తున్నా నూటికి నూరు శాతం అక్షరాస్యత సాధించలేదు.

ఆ లక్ష్య సాధనకు, డా॥ సత్యనారాయగారు సులభ శైలిలో, వాడుక భాషలో చదవటానికి, పాడటానికి వీలయిన మాటలతో రచించిన గేయాలు పద్యాలు ప్రయోజనం చేకూరుస్తాయి.

ఉదాహరణకు

1. అ ఆ లు రావయ్య – ఆదుకోవయ్యా
2. చిన్ని తమ్ముడా ! లేర ! ముద్దు తమ్ముడా ! రార
3. బాలల్లారా! రారండి
4. చెట్టుపుట్ట – ఎక్కుతావు
5. ఓ చిన్న పిల్లోడా! ఎంత చలాకివాడా!

అన్న గేయాలు, బడికి వెళ్లి చదువుకోకుండా, తిరుగుతున్న పిల్లల్ని బుజ్జగిస్తూ చదువుకోమని ప్రోత్సహిస్తున్న తీరు చక్కగా ఉంది.

తల్లి దండ్రులు ఆడపిల్లల్ని బడికి పంపకుండా ఇళ్లలోను, పొలాల్లోను పని చేయిస్తూంటారు. అటువంటి పిల్లలకు కొందరికి చదువుపైని ఆసక్తి కలిగిస్తున్న గేయాలు చదవదగినవి.

ఉదా :-

1. అమ్మ బడికి - పంపవే - చదువుకుంతు నీపన్లు
2. ఆడపిల్లలందరం - చదువు కుందాము -
3. చదువుకుంటానమ్మ - బడికి నన్నంపవే

అన్న గేయాలలో చదువురాని ఆడపిల్లలు చదువురాక పడుతున్న కష్టాలు వారికి చదువు వస్తే కలిగే లాభాలు - సహజంగా వర్ణింపబడ్డాయి.

చదువుకుందాం - బాగు పడదాం<br>
గ్రామ సీమలు - బాగు చేద్దాం ॥చ॥

దేశభక్తితో - మసలుకుందాం<br>
దేశ సేవలు - చేయుచుందాం<br>
ఓటు వేసి - ఎన్నుకుందాం<br>
మేలుచేసే నాయకులను ॥చ॥

గాంధి కోరిన - రామ రాజ్యం<br>
గ్రామరాజ్యం - తెచ్చుకుందాం<br>
కులము, మతము - చూడకుండా<br>
ఎన్నుకుందాం - మంచివారిని ॥చ॥

మాయ మాటలు - చెప్పి మనలను<br>
మోసగించే - వారినెపుడు<br>
నమ్మకుండా - చదువుకుందాం<br>
వేలిముద్దర వేయకుండా<br>
రాత్రి బడిలో చదువు కుందాం ॥చ॥

ఇటువంటి గేయాలు నిరక్షరాస్యుల్ని మేలుకొలిపి, చదువు కొమ్మనిదేశ సేవ చేయమని బాగు పడమని ప్రబోధిస్తున్నాయి.

1. నిరక్షరాస్యత నిర్మూలిస్తాం
2. మహిళల్లారా!
3. కర్షకులారా! కార్మికులరా!
4. మేలుకో వోయ్ – వయోజనుడా!
5. ఎవ్వరయినా – చదువ వచ్చును
6. పల్లెల్లోను – పట్టణాలలో
7. సాగు చేయుచు – చక్కగా చదవరా!
8. చదువుకుందాం – బాగుపడదాం

చదువు రానందువల్ల కలిగే కష్ట నష్టాలు, చదువుకుంటే కలిగే సుఖశాంతులు, అభివృద్ధి, గౌరవం మొదలైన ప్రయోజనాలు, అన్ని వయస్సుల వారికి అన్ని వృత్తుల వారికి, బాల బాలికలకు, యువతీ యువకులకు, లభిస్తాయని తేట తెల్లంగా అందరికి అర్థమయ్యే రీతిలో రచించిన డా।। ఎం. వి. సత్యనారాయణగారిని హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను.

ఈ పుస్తకంలోని నీతి పద్యాలు బాల బాలికలు కంఠస్థం చేయటానికి వారి తల్లి దండ్రులు, ఉపాధ్యాయులు తోడ్పడాలి. ఈ గేయాలు, పద్యాలు, అచ్చుయి ప్రచారంలోకి రావాలని కోరుతున్నాను.

ఇట్లు

**ఆచార్య ఎల్ వేణుగోపాల్‌రెడ్డి**

**Smt. L. Vasundhara**
W/o. Prof. L. Venu Gopal Reddy
Vice Chancellor, Andhra University

Visakhapatnam
Dt. : 29-4-2006

## ప్రబోధ గేయాలు

డా॥ ఎం.వి. సత్యనారాయణగారు రచించిన కొన్ని పుస్తకాలు మా శ్రీవారు ఆచార్య ఎన్. వేణుగోపాల రెడ్డిగారికి బహూకరించారు. నేను కూడా కుతూహలంతో వాటిని చదివాను.

నేను చదివిన వాటిలో శ్రీ వేంకటాచల మాహాత్మ్యం సంస్కృతం నుండి తెలుగు వచనంలోనికి అనువదింపబడినది. అలాగే వారు సంస్కృతం నుండి తెలుగు వచనంలోనికి అనువదించిన శ్రీ జగన్నాధ క్షేత్ర మాహాత్మ్యానికి వారే ఆంగ్ల వచనాను వాదం చేసారు. అవి అనువాదాలుగా కాకుండ స్వతంత్ర రచనలుగానే ఉన్నాయి.

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు ఉపన్యాసాలలో ప్రసంగవశాత్తు సూత్రప్రాయంగా చెప్పిన ఆంగ్లంలోని వాక్యాల్నే డా॥ సత్యనారాయణగారు ఆటవెలది పద్యాల్లో వివరణాత్మకంగా రచించిన శ్రీ సత్యసాయి సూక్తిముక్తావళి ఆధ్యాత్మిక వేదాంతాల సారం భక్తులకు ప్రయోజన కరంగా ఉంది. ఈ పుస్తకం చదివిన భక్తులకు భక్తి జ్ఞానవైరాగ్యాది విషయాలు సులభంగా తెలుస్తాయి.

కవి సంఘజీవి. అతను తన సమకాలంలో నివసిస్తున్న వివిధ వర్గాల ప్రజల స్థితి గతులు కళ్లారచూస్తూ ప్రజల ప్రగతికి, దేశాభివృద్ధికి, దేశ సమైక్యతకు, భద్రతకు తోడ్పడే రచనలు చేయకుండా ఉండలేడు. అటువంటి మహాకవులు నాడు నేడు ఉన్నారు.

డా॥ సత్యనారాయణగారి గ్రంథాలు కేవలం మేధావి వర్గానికే కాకుండ, సమాజంలోని తక్కువ చదువు వచ్చిన వారికి, చదువురాని వారికి కూడ కనువిప్పు కలిగించి, వారిలోపాలు వారు తెలిసికొని వారి తెలివితేటల్ని సక్రమంగా వినియోగించుకొని, సంఘంలో తలెత్తుకొని తిరుగుతూ సుఖ జీవనం గడపడానికి ఉపకరించే ప్రబోధించే గేయాలు – నీతి పద్యాలు కూడ ఉన్నాయి. ఈ గేయాలు వాడుక భాషలో మారుమూల పల్లెలలో, పట్టణాలలోని మురికివాడలలో నివసిస్తున్న

నిరక్షరాస్యులకు, సంతకం చేయడం రాని వారికి రోజుకు ఒకపూట కూడ తిండి లేక బాధపడుతున్న బడుగువర్గాలవారికి సందేశాలు, సలహాలు, ఇస్తూ ప్రగతి పథంవైపు ఆశాజ్యోతిని చూపిస్తున్నాయి.

ఉదాహరణకు :

1. చదవండి, చదవండి – రాత్రి బడిలో చదవండి
2. చదువురాని – ఆడవారు
   ఎన్నోపాట్లు – పడుతున్నారు
3. రావోయ్, రావోయ్ – వయోజనుడా! రావోయ్ కాలము మారింది –
   చదువుకు, రావోయ్
4. వేలి ముద్రలు – మానవలెనోయ్
   సంతకాలు – నేర్వవలెనోయ్

ఇటువంటి ఉదాహరణలు ఎన్నేనా ఇవ్వవచ్చును. ఈ పుస్తకం త్వరలో అచ్చయి డా॥ సత్యనారాయణగారి ఆశయం నెరవేరాలని సామాజిక న్యాయం జరగాలని ఆశిస్తూన్నాను.

ఇట్లు

**L. VASUNDARA**

**Prof. P. VIJAYA PRAKASH**
M.A., Ph.D.
REGISTRAR
ANDHRA UNIVERSITY



Fax : 0891-2755324
0891-2525611
Grams : "UNIVERSITY"
Phone : Off.: 2755324, 2565100
Res. : 2783876, 2539510
Visakhapatnam 530 003 (A.P.)

Date : 26-04-2006

## 'PRABODHA GEYAALU'

## OPINION

It gives me great pleasure to note that Dr. M.V. Satyanarayana, who has been with us at the University, Department of Telugu, has done this kind of literary service too. He has rendered service for over thirty long years and has now, even after his superannuation, felt his commitment to the society, especially to adult education. I could feel the heartbeats of his to motivate and to incite those innocent, illiterate folks to enjoy the benefits of being a literate.

I congratulate him and wish him all success in this life long commitment. I have no hesitation to recommend these "PRABODHA GEYAALU" for the use of those functionaries, and also to any adult education programme.

P. VIJAYA PRAKASH
REGISTRAR

Andhra University
Visakhapatnam
Dt. 27-7-2004

**Prof. P.S.N. RAJU,** Hony. Librarian, Dr. V.S. Krishna Library and Chairman, Indian Society for Technical Education of A.U. Engg. College.

## PREFACE

Dr. M.V. Satyanarayana has been devoting all his precious time for writing and editing the books on various subjects relating to Vedas, Upanishads, - Puranas, Indian Philosophical, religious works to the benefit of the educated and uneducated people for their upliftment and progress in all walks of life in the society, for Utilising their mental, intellectual, SOUL powers and faculties by knowing the value of their human birth and leading peaceful life in the same birth and attaining salvation to avoid rebirth.

I have gone through the published and unpublished literature of Dr. M.V. Satyanarayana.

His books, Sri Venkatachala Maahaatmyamu, Sri. Jagannatha Kshetra Maahaatmyamu (Telugu & English prose) translated from Sanskrit Skandapuranam of Vyasamaharshi; Sri Rama, Sri Krishna, Sri Panduranga, Sri Satya Sai Satakams & Sri Satya Sai Suktimuktaavali in Telugu Poetry were already published and in wide circulation. They are being translated into English and Hindi prose for publication soon. " SRI PANDURANGA SATAKAMU" (103 Seesapadyamulu in Telugu) with very valuable and useful opinions of the most eminent and experienced scholars, pandits and critics is under print. It will see the light of the day shortly.

"NAVAKAVITA" [176 modern Telugu poetical selections] " KAAVYASAMEEKSHALU" [30 Critical essays on old Telugu poetical works] edited by Dr. M.V. Satyanarayana were published by the Andhra University, as University Publications while he was working in the Telugu

Department, Andhra University.

A Descriptive catalogue of Telugu Manuscripts and A Descriptive catalogue of Sanskrit Manuscripts edited by Dr. Satyanarayana are published by this University as University publications in 1999 and 2004. Two more volumes of Descriptive Catalogues of Sanskrit Manuscripts edited by Dr. M.V. Satyanarayana are ready for publication.

Presently, 59 songs and 88 poems composed by Dr. M.V. Satyanarayana with the theme. aim and effort for eradication of illiteracy and poverty are very useful in these days, for the teachers of the concerned departments and organisations.

May GOD bless the poet, for leading happy, healthy and peaceful life for continuing and completing his useful literary, spiritual, Philosophical books relating to vedic and Sanskrit literatures, world religions, MAN-GOD & AVATAR; and Sri Satya Sai Baba is GOD & AVATAR; "GEYARAMAYANAMU" (Telugu songs) etc.

**P.S.N. RAJU**




***Dr. B.R. Ambedkar College of Law***
*Visakhapatnam - 530 003*

**Prof. R. Venkata Rao**
PRINCIPAL

Tel : 2754871 Ext. 4777 (Office)
0891 2755743 (office)
0891 2540371 (Res.)

Dt. 14th August, 2004

It delights me to write few words about Dr. Modekurti Venkata Satyanarayana who is a scholar worth emulating. Having gone through his diverse and varied works which include Panduranga Satakam, Mahatmula Jeevita Sandesaalu, Desa Bhakti and Daiva Bhakti, Prabodha Geyaalu among others, I can state with confidence that Dr. Satyanarayana must be complimented for his lucid and simple style and clarity of thought.

I am sure that all persons interested in inculcation of values will find it a rich and rewarding experience to go through the works of Dr. Satyanarayana.

I pray the almighty to give Dr. Satyanarayana all that he looks forward to in his life.

**(R. VENKATA RAO)**
PRINCIPAL

# PRABODHA GEYAALU - NEETI PADYAALU

Sri T.V. Ramana Murty
Joint Registrar &
Controller of Examinations
Andhra University
Visakhapatnam - 530 003 (AP)

Visakhapatnam
23-7-2001.

**POET - SCHOLAR**

Dr. Modekurti Venkata Satyanarayana is known to me for the last three decades. After his primary education in Badangi village vizianagaram Dist. A.P. he studied Sanskrit under gurukula system in VEDAPAATHASAALA [Sanskrit High School] in Salur, Vizianagaram Dist. (A.P.) from 1938-'43 and then Sanskrit in Maharajah Sanskrit College, Vizianagaram (A.P.) during 1943-'45. Afterwards, he studied Benaras Matriculation Course Privately and passed the Matriculation Examination held by Benaras Hindu University, Varanasi in April 1947, Sanskrit as compulsory subject. And then Sri Satyanarayana studied Intermediate course with Sanskrit under part II and III in M.R. English College, Vizianagaram (A.P.). Next, he studied B.A. (Hons) with Telugu Language and literature, Dravidian Philology and a comparative grammar of south Indian languages and Sanskrit as a compulsory subject in Telugu Department Andhra University Visakhapatnam during 1949-'52 when Dr. C.R. Reddy and Prof. V.S.Krishna were the Vice-Chancellors.

As per the advice of his teacher, late Professor G.J. Somayaji, the then H/D of Telugu Andhra University and Director, the Etymological Dictionary scheme, Telugu Department, A.U. Sri Satyanarayana resigned his teacher's post and joined as a Research Assistant in the said scheme in 1957.

As per my advice and encouragement, Dr. Satyanarayana prepared two books for publication - (1) DESABHAKTI (PATRIOTISM) - An Anthology of Telugu songs end lyrics; (2) DAIVABHAKTI (5 Satakams in Telugu) First editions of the said satakams are in wide circulation. Very eminent and experienced Scholars, authors, poets, and critics have written their valuable opinions in Telugu, English and Hindi on his works.

Dr. Satyanarayana has commenced translating them into English prose Some experienced writers have started translating the said two books into Hindi

prose for publication.

In the songs of his 'GEYARAMAYANA' I find his literary, religious, philosophical and spiritual heritage, talent, devotion and surrender to Lord Rama and Hanuman. Sonorous ragas were composed to his Geyaramayana by eminent musicias.

With my pressure Dr. Satyanarayana who is busy in Andhra University, with editing, and publication work, and his personal publications in different languages is continuing to compose the songs and lyrics with divine grace based on the substance of BAALAKAANDA and AYODHYAKAANDA in VALMIKIRAMAYANA (Sanskrit).

I congratulate Dr. M.V. Satyanarayana who is a scholar in Telugu, Sanskrit, and English, for his creative works & different languages and I wish he should continue his efforting with the grace of Lord Rama in the years to come.

May God bestow upon him good health & longevity and peace of mind enabling him to contribute his literary, philosophical, spiritual knowledge and experience to the benefit of enlightened readers.

**T.V. RAMANA MURTY**



*INSTITUTE OF ADVANCED STUDIES IN EDUCATION*

# ANDHRA UNIVERSITY

From :
Prof. Y.F.W. Prasada Rao
Dean / Chairman, Faculty of Education,
Principal, IASE

Phone : (Office) 0891-2844130 / 4131
(Residence) : 0891 - 2503641, 3090643
Mobile : 98484-98474, 9346337400, 9247134461
E-mail:yfwpr23@yahoo.com
Visakhapatnam - 530 003
Andhra Pradesh, INDIA

Visakhapatnam
17-02-2005

I had the privilege of going through the poems of Dr. M.V. Satyanarayana garu. These poems written in telugu language, entitled 'Prabodha Geyaalu', have the real 'prabodham' in it, in every sense of the word. I am sure if they are sung before the audience for whom it is meant for with proper 'raaga' will achieve its purpose to the full extent. Even as I was reading I felt that the writer had the real vision of the people, their names, backgrounds, challenges in clear view. I wish that a real programme of adult education must use such things to its full utility.

I personally congratulate Dr. M.V. Satyanarayana garu for the great task he has fulfilled. He, though in technical sense a retired person, is still growing active in the task of adult education and in clear and real terms continuing education. I wish him success in all such endeavors.

Thanking the author for the privilege bestowed on me.

**[Y.F.W. PRASADA RAO]**



***DEPARTMENT OF EDUCATION***
***ANDHRA UNIVERSITY, VISAKHAPATNAM***

From :
Dr. K. P. SUBBA RAO
Head

Phones : Head 2844325 / (P) 2844328 / Off 2844324
(R) 2560659 / Mobi 939-3128851
E-mail : subbaraokp@yahoo.com

Visakhapatnam
16-2-2005

I immensely happy to go through the literature penned by Dr. M.V. Satyanarayana who is an erudite scholar both in Sanskrit and Telugu. His rich experience in the field of Adult education drove him to write progressive songs and poems. This definitely will give long last impression on the reader. His impressions made him to all the sections of people like agricultural and factory labourers peasants, coolies, women etc. Though they are in colloquial in nature but they are simple, lucid. and powerful. A common man can perceive the essense of the poems and songs.

Dr. M.V. Satyanarayana is very empathetic towards the illiterates of all the colours devoid of caste and creed His audience range from illiterate to innocent. He believes that an educated person has enormous opportunities to realize his/her goals in life. His poems and songs emphasize the sterling qualities like courage, patriotism, loyalty, respect, prestige, ethical standing, to mention a few. According to him these qualities can be acquired by an individual through education for which the literacy is a pre requisite.

I wish him all success in his future endeavors.

**(K.P. SUBBA RAO)**



# *DEPARTMENT OF EDUCATION*
# *ANDHRA UNIVERSITY*

Prof. O.R. Reddy
Chairman, BOS (PG) Education
M.A.(TEL)., M.A(EDN)., Ph.D., O & M (Diploma)

Phone : 0891-2710928 (O)
08912575914 (R)
Cell : 98494 54838
Fax : 0891 - 2550158, 275547
E-mail : orreddy@rediffmail.com

Dr. M.V. Satyanarayana is known to me for the last two decades. He worked in the Departments of Telugu and Adult & Continuing Education. And then he has been working in the manuscripts section, Dr. V.S. Krishna Library, Andhra University, Visakhapatnam since 1993 till date. The books edited and authored by him are in wide circulation.

I have gone through his "PRABODHA GEYAALU" AND "NEETI PADYAALU" which are worth publishing. The educational institutions must procure for their libraries for motivating the boys, girls, and the youth who can not read, write alphabets, numericals and sign especially in the tribal and slum areas, villages and cities.

The aim and effort of Dr. Satyanarayana is clearly known to one and all in these songs and poems in telugu that illiteracy and poverty are prime hindrance for the development, happiness, peace unity, safety of the individuals in the society, country and world.

I congratulate the poet, author, editor, patriot Dr. M.V. Satyanarayana by writing these valuable useful lyrics, songs, and poems, in lucid, simple and spoken dialect for singing by the musicians with archestra and recording them on cassets.

They may be supplied to the teachers programme officers for using them for eradication of illiteracy and poverty to achievement percent literacy in India.

***(O.R. Reddy)***

**Dr. Y. Bhaskara Charyulu**
M.A., Ph.D.,
Head of the Department of Adult &
Continuing Education
Andhra University,

Visakhapatnam
Dt. : 18-1-2006

---

## ప్రబోధగేయాలు

## ప్రశంస

డా॥ మోదేకుర్తి వేంకట సత్యనారాయణగారు రచించిన "ప్రబోధ గేయాలు–నీతి పద్యాలు" వయోజన విద్యా ప్రచారానికి, నిరక్షరాస్యత నిర్మూలనకు ఉపయోగ కరంగా ఉన్నాయి. ఈ పుస్తకం లోని విషయాలు సులభమైన వ్యావహారిక భాషలో ఉన్నందున, వీటిని చదవటానికి పాడటానికి, నిరక్షరాస్యులు విని అక్షరాస్యులు కావాలని ఆసక్తితో కృషి చేయటానికి వీలుగా, ప్రబోధిస్తున్నాయి.

డా॥ సత్యనారాయణగారు ఈ పుస్తకం అచ్చువేయించి అందరికి అందుబాటు లోనికి తీసుకురావాలని హృదయ పూర్వకంగా కోరుతున్నాను.

ఇట్లు
**వై. భాస్కరాచార్యులు**

# PART - I

## 1. చదవండి, చదవండి

చదవండి, చదవండి – రాత్రి బడిలో, చదవండి
ఆడవారు, చదవండి – మగవారు, చదవండి

కేంద్ర రాష్ట్ర – ప్రభుత్వాలు –
వాడ వాడల – మురికి వాడల
మారు మూలల– కొండ కోనల
బడులు, పెట్టాయ్ – చదువు, కోమని ॥చ॥

చదవ, కుంటే – వచ్చు, నష్టం
చదువు, కుంటే – కల్గు లాభం
ప్రతీ, మనిషికి – చదువు, ముఖ్యం
చదువు, ఇచ్చును – ధనం, సౌఖ్యం ॥చ॥

చదువు, వల్లనె – మంచి నడవడి
ఉద్యోగ, పదవులు – పొంద వచ్చును
గాంధి, తాత – వంటి, వారు
చదువు, వల్లనె – పొందినారోయ్
శీల, సంపద – త్యాగబుద్ధి ॥చ॥



## 2. చదువురాని - ఆడవారు

చదువు, రాని – ఆడవారు
ఎన్నో, పాట్లు – పడుతున్నారు ॥చ॥

పెళ్లి అయినా – పనులు, దొరకక
పేదరికము – అనుభవిస్తూ
సౌఖ్యమేమీ – లేక భర్తతో
నరక బాధలు – పడుతునారే ॥చ॥

## 4. ఓటు హక్కు నీకు - ఇచ్చారు, అన్నా!

ఓటు హక్కు నీకు – ఇచ్చారు, అన్నా
ఓటు విలువికనైన – తెలుసుకో రన్నా ॥ఓ॥

దేశనాయకులు – చదువుకున్నారు
త్యాగాలు చేసి – స్వాతంత్ర్యమిచ్చి
బాగు చేస్తున్నారు – ప్రజల నందరిని
ఎన్నుకోమన్నారు – పెద్ద పదవులకు ॥ఓ॥

ఏ పార్టి మంచిదో – ఎరుగవు నువ్వు
శక్తి మంతుణ్ణి – తెలిసికోలేవు
ఏ పార్టి గుర్తును – చెప్పనే, లేవు
ఎవరికో ఓటేస్తె – ఏం బాగుపడతావ్ ॥ఓ॥

చదువుకో, తెలిసికో – నీ ఓటు విలువ,
వేలి ముద్రలు, మాని – సంతకం చెయ్యి
మంచి వారికి నీవు – ఓటు వేస్తేను
మంచి జరుగుతుంది – మన దేశ ప్రజలకు ॥ఓ॥

★★★

## 5. చదువు వల్లనె - తొలగిపోతాయ్

చదువు వల్లనె – తొలగి పోతాయ్!
బీదరికము – వెనుక బడటం ॥చ॥

ఎవరు ఏయే – వృత్తి చేసిన
ఎవరు ఏకుల – మందు పుట్టిన
ఎవరి కెంతో – వయసు వచ్చిన
చదవ వచ్చును – శ్రద్ధ చూపిన ॥చ॥

విరామ సమయం – వ్యర్థ పుచ్చక
కూలి చేయుచు – ఫేక్టరీలలో
పన్లు చేయుచు – సాగు చేయుచు
చదవ వచ్చును – సకల జనులును ॥చ॥

కావాలి, అందరికి – అన్నిచోట్ల, ఉండాలి,
చదువు, కుంటే, డాక్టర్లు – ఇంజనీర్లు, అవుతారు ॥చ॥

చక్కని, సేద్యంకి, చదువు – ఫేక్టరీ, పనికి, చదువు
చదువుకుంటె, చక్కదిద్దు – కుంటారు, మీకు మీరె,
పల్లెల్లో, పట్టణాల్లో – ప్రజల, కెంతో, తెలివి వుంది
చదువు లేక, బాధపడుతు – పాడైపోతున్నారు ॥చ॥

నూతిలో, కప్పలాగ – గుడిసెల్లో కునుకుతారు
గోతివార నక్కవంటి – దళారీల మోసాలు
ఇళ్లల్లో, ఆలుబిడ్డల – ఆకలి ఏడ్పులు
సమస్యలు, తీరుతాయి – రాత్రి బడిలో, చదవండి ॥చ॥

పాడి పశువుల పెంపకాలు – అన్ని పథకాల్ చెప్పుతాము
సేద్యానికి, వృత్తులకు – కొత్త పద్ధతి, నేర్పుతాము
అధిక, దిగుబడు, లొస్తాయ్ – ఆదాయం పెరుగుతుంది
చదవండి, పొందండి – ప్రభుత్వాల రాయితీలు ॥చ॥

★★★

## 8. చదువుకోరా - ముద్దు తమ్ముడా!

చదువు కోరా – ముద్దు తమ్ముడా!
తెలిసికోరా! – మనిషి విలువ ॥చ॥

ఎండ వానల్లోని – తిరుగుతు
రాత్రి పగలు – కష్టపడతావ్
చదువుకుంటే – ఇల్లు కడతావ్
భూమి కొంటావ్ – పేరు తెస్తావ్ ॥చ॥

వెట్టి చాకిరితో – విసుగెత్తి పోయావు
పాలేరు పనితో – పాట్లెన్నొ పడ్డావు
కూలి పన్లు చేసి – కుమిలి పోతున్నావు
ఎద్దుల్తో దున్నుతూ – మొద్దువై పోయావు ॥చ॥

రోజుకు ఒక గంట - సదువు సెపుతారు
కులవృత్తుల గురించి - వివరంగ సెపుతు
కుటీర పరిశ్రమల్ - ఎడతారు, మనకు
చేతినిండా పని - తిండి ఉంటాయి ॥సీ॥



## 10. వయోజనులం - చదువుకుందాం

వయోజనులం - చదువుకుందాం
బ్రతుకు తెరువు - తెలుసుకుందాం ॥వ॥

మున్సిపాల్టీవారు - గవర్నమెంటు వారు
వీధి వీధుల్లోను - మురికి వాడల్లోను
చెట్ల క్రింద, గుడిలో - బడులు పెట్టారు
చదువు చెపుతామని - గురువు లొచ్చారు ॥వ॥

పగటి పూటో లేక - రాత్రి పూటో మనం
తీరిక ఉన్నపుడె - చదువుకుందాము
రోజుకు ఒక గంట - రాయడం, చదవడం
లెక్కలు సేయడం - నేర్చుకుందాము ॥వ॥

పన్లు వృత్తులు - మానవద్దని
డబ్బు ఖర్చు - మనకి లేదని
పుస్తకాలు - పలక పుల్లలు
మాస్టరిచ్చి - చదువు చెప్పును ॥వ॥

వేలి ముద్రలు - మానిపించి
సంతకాలు - నేర్పుతారు
మనము పలికే - మాటలన్ని
పలకమీద - రాయగలము ॥వ॥



మంచి నీరును త్రాగి – మంచి గాలిని పీల్చి
మంచి బట్టలు కట్టి – మసలండి మీరు
రాత్రి బడులను పెట్టి – మీలాటి యువకులకు
నేర్పుతామక్కడే – అక్షరాల్ అంకెలు
సంతకాల్ పాఠాలు – చక్కగా, నేర్పండి ॥క॥

★★★

## 13. మూడు పూలు - ఆరు కాయలు

మూడు పూలు – ఆరు కాయలు
చదువుకున్న – వారి బ్రతుకు ॥మూ॥

జీవనదులు – పారుతున్నాయ్
భూములందు – సారముంది
ప్రకృతి మాత – కరుణ ఉంది
చదువుకోవోయ్ – తెలివి ఉంది ॥మూ॥

మంచి విత్తులు – తెలిసికోవోయ్
పొలములందు – నాటుకోవోయ్
అన్ని పంటలు – పండుతాయోయ్
దేశప్రజలకు – పంచుతావోయ్ ॥మూ॥

వేలిముద్రలు – మానవలెనోయ్
సంతకాలు – నేర్వవలెనోయ్
ఉపాధ్యాయులు – వస్తున్నారోయ్
చదువు రాత – నేర్పుతారోయ్ ॥మూ॥

శక్తియుక్తులు – పెంచుకోవోయ్
మంచి చెడ్డలు – తెలిసికోవోయ్
ప్రభుత్వాలు – బీదవారికి
ఎన్నో సాయాల్ – చేస్తున్నాయ్ ॥మూ॥

★★★

## 15. సోకిలా నా బావ!

సోకిలా నా బావ! – నీ కట్టు బొట్టు సూసి
సదువొచ్చినోడవని – సణుగుకుంతన్నారు ॥సో॥

పెసలు, మినుగులు – ధాన్యం, పంటలు, పండిత్తావు
తూకం, కొలత, లెరగవ్ – సావుకారికమ్ముతావ్
అచ్చురాలు, సదవనేవు – అంకెలైన సెప్పనేవు
సావుకారు ఏది సెప్తె – అదె నమ్ముతుంటావు ॥సో॥

వయోజన పాఠశాల – మనవూళ్లో ఎట్టారు
దేవుడి గుడికాడ – రాత్రి బడి ఎట్టారు
ఇకనేన, రాత్రి బడిలో –సదువుకుంతావ, బావ!
సావుకారు నిన్నింక – మోసగించనేడు, బావ! ॥సో॥

బస్సు నెంబరు తెలుత్తాది – ఊరు పేర్లు, సదువుతావ్
తూకం, కొలత, తెలుత్తాది – బేర, సారా, లాడతావ్
ధరల, వివరా లెరిగి – ఎక్కువ ధర కమ్ముతావ్
రూపాయిలు, నెక్కెడతావ్ – సదువుకుంటె మోసపోవు ॥సో॥



## 16. రామన్న! రామన్న!

రామన్న! రామన్న! – ఈ యింత ఇన్నావ!
ఎంకన్న సదివాడు – గొప్పోడు, అయ్యాడు ॥రా॥

గుడిసెల్లో గుంటలంట – గుమిగూడుతుంతారు;
కొట్టుకుంతు, తిట్టుకుంతు –కాలు సేతు లిరుసుకుంతు
పోరంబోకు, కుర్రోళ్లు – పొద్దల్లా తిరుగుతారు
తల్లి మాట తండ్రి మాట – పెడ సెవిని ఎడతారు ॥రా॥

సదువు నేక, సెడిపోయాం – పిల్లల్ని బాగు సేద్దాం
పగటి వేళ, పన్లు నేర్పి – రాత్రి బడికి పంపిద్దాం
మనం కూడ, సదువుకుందాం – ఆడోళ్లని సదివిద్దాం
పెబుత్వాల పతకాలు – ఇకనేన, తెలుసుకుందాం ॥రా॥

## 18. చదువుకుంటే - బాగుపడతాం

చదువుకుంటే – బాగుపడతాం
చదవకుంటే – బాధ పడతాం ॥చ॥

బ్రతుకు తెరువుకు – చదువుకుందాం
పరులు మనలను – బాగు చేస్తారా?
మనము చదివి – బాగు పడదాము
పగలు బడిలో – చదువుకుందాము ॥చ॥

భూము లమ్మి – చదువుకున్నారు
బంగార మమ్మి – విద్య నేర్చారు
అప్పు చేసి – చదువుకున్నారు
చదువు విలువ – తెలిసికున్నారు ॥చ॥

పల్లెలందు బడులు లేవని – పట్టణాల్లో చదువుకున్నారు
ఈ దేశంలోని, చదివి – పై దేశం, చదువు, కెళ్లారు
ఎన్నో బాధలు పడ్డవారు – పెద్ద చదువులు – చదువుకున్నారు
మనవారి, తెలివికి – తెల్లదొరలు మెచ్చుకున్నారు ॥చ॥

చదువుకుందాం – దేశ సేవకు
బాగు చేద్దాం – భరత దేశం
పాటుపడదాం – ప్రజల మేలుకు
చాటి చెప్దాం – చదువు విలువను ॥చ॥

★★★

## 19. నీ వూళ్లో - బడిలోనే

నీ వూళ్లో, బడిలోనే – చేరావు చిన్నపుడు
బడికి, వెళ్లటం, లేదు – చదువు పూర్తి చేయలేదు ॥నీ॥

నీ తండ్రి బడికి పంపి – చదువుకోమన్నాడు
పంతులు నిను చేరదీసి – చదువు బాగ చెప్పాడు
రెండు మూడు తరగతులు – శ్రద్ధగానె చదివావు
పని కొస్తావని పంతులు – పదిమందికి చెప్పాడు ॥నీ॥

## 21. ఎంకమ్మ! - ఎంకమ్మ!

ఎంకమ్మ! ఎంకమ్మ! – ఎంతో గొప్ప దానవయ్యావ్
రాత్రి బడిలో, సదువుకొని – రాణించావ్, రాణించావ్ ॥ఎం॥

ఇంతలోనె మా యెదుట – పెద్దదానవయ్యావు
ఏటేటి, సేసావు – ఎలాగింత, దానవయ్యావ్
ఇంతాము, ఇవరాలు – ఇడమర్చి సెప్తావ
సదువు నేర్చుకున్నావు – సంతకం, సేత్తావు ॥ఎం॥

పగలనక, రాతిరనక – నీ మొగుడు, తాగుతాడు
ఇంటింటికెల్తున్నాడు – అప్పులు, సేత్తున్నాడు
రాత్రి బడికి ఎల్లినావు – రాత నేర్చుకున్నావు
కోడి పెట్టలు, కొన్నావు – కోడిగుడ్లు, అమ్ముతావు ॥ఎం॥

సీరలు, తెత్తావు – ఇంటింట, అమ్ముతావు
మేక పిల్లలు కొని – మేపడానికిత్తావు
పెద్దవైతె, అమ్ముతావు – డబ్బు సేసుకుంతావు
కుట్టు మిసన్, తెచ్చావు – బట్టలు, కుట్టుతావు ॥ఎం॥

నీ దగ్గర, సదువుకుంతాం – నువ్వు సెప్పినట్లె, సేత్తాం
ఏలి ముద్దర, మానెత్తాం – సంతకాలు, నేర్చుకుంతాం
వయోజనులు, ఆడవాళ్లం – సదువుకోని బాగుపడతాం
వృత్తి పన్లు, సేసుకుంతు – పరిశ్రమలు పెట్టుకుందాం ॥ఎం॥

★★★

## 22. పోలయ్య! - పోలయ్య!

పోలయ్య! పోలయ్య! – రాత్రి బడికి ఎల్దాము
సక్కగా సదువుకుందాం – పై సదువుకు, ఎల్దాము ॥పో॥

సిన్నప్పుడు, నా తండ్రి – బడికి పంపినాడు కాని
సిలిపి పన్లు, సేసాను – సదవకుండ తిరిగాను
నాతోటి, వారంతా – సెద్దగా సదివారు
పట్నాల కెల్లారు – పట్టుగ, పాసయ్యారు ॥పో॥

మనం పిల్లలందర్ని – బడికి పంపించుదాం
రాత్రి బడిలొ సదువుకొని – బాగు పడితె సూద్దాం
ఎంకన్న లాగ వార్కి – పెద్ద పదవు లొత్తాయి
మనమంతా సదువుకుంతె – దేశం బాగుపడతాది ॥ఎం॥

★★★

## 24. ఆడోళ్లకు - పథకాలు

ఆడోళ్లకు పథకాలు – పెబుత్వాలు పెట్టాయి
అప్పలమ్మ! ఇన్నావా – అవి మనకి పనికొత్తాయ్ ॥ఆ॥

సదువుకున్న ఆడోళ్లు – పేపర్లు సదువుతారు
రేడియోలు ఇంతారు – టి.వి.లు సూత్తారు
మహిళాసంగా లెట్టారు – మనకు మంచి సేత్తారు
ఆడోళ్ల అక్కుల్ని – అప్పుడప్పుడు సెపుతారు ॥ఆ॥

సదువురాని ఆడోళ్లకు – రాత్రి బళ్లు ఎట్టారు
పలక పుత్తకాలిచ్చి – సదువు రాత నేర్పుతారు
బడికెళ్లి మానీసిన – బడికీ, ఎల్లకపోయిన
ఒయసుతో పనినేదు – సదువు నేర్పుతుంతారు ॥ఆ॥

ఊరంతా తిరుగుదాం – ఇంటింటికి ఎల్దాము
పదేనేళ్లు మొదలుకొని – ముప్పై యైదేళ్లవార్ని
రాత్రి బడికి రమ్మందాం – రోజుకో గంట సదివిద్దాం
అక్కులన్ని తెలుసుకొని – బాగుగా బతకమందాం ॥ఆ॥

వయోజన శాకవారు – ఊరూర ఎల్తునారు
కూలీలకు కార్మికులకు – గుడిలోను, బడిలోను
అచ్చరాలు అంకెలు – పాటాలు సెపుతున్నారు
ఏలి ముద్రలు మాన్పించి – సంతకాలు నేర్పుతారు ॥ఆ॥

★★★

నిరక్షరాస్యత, నిర్మూలిద్దాం – అక్షరాస్యతను పెంచుదాం
పల్లెల్లోను, పట్టణాలలో – అక్షర జ్యోతి వెలిగిద్దాం
ఎర్నాకులం జిల్లాలోను – నూటికి నూరు అక్షరాస్యత
ఆంధ్రులందరం, మనరాష్ట్రంలో – వయోజనులను చదివిద్దాం ॥చ॥

నిరక్షరాస్యత – బ్రహ్మరాక్షసి
నిరక్షరాస్యత – దరిద్ర దేవత
నిరక్షరాస్యత – క్రూర పిశాచం
నిరక్షరాస్యత – నిర్మూలిద్దాం ॥చ॥



## 27. మహిళల్లారా! - రారండి

మహిళల్లారా! రారండి
సాటి మహిళలను – కలియండి ॥మ॥

వాడవాడల తిరగండి – ఇంటికి ఇంటికి వెళ్లండి
వారికి చదువుట, రాయుట – వచ్చునొ, రాదో అడగండి
తల్లిదండ్రులు చదవాలి – వారి పిల్లలు చదవాలి
వారి వృత్తులు చేయొచ్చు – కూలీ, నాలీ చేయొచ్చు ॥మ॥

ఆ, నిరక్షరాస్యులు – రాత్రి బడికి రావాలి
వారు చదువు నేర్చుకొని – సంతకాలు చేయాలి
వేలి ముద్రలు మానాలి – సమస్యలన్నీ తీరాలి
చక్కని బ్రతుకు బ్రతకాలి – ఉత్తమ పౌరులు కావాలి ॥మ॥

ఇల్లాలి చదువు – ఇంటికి వెలుగు
అక్షర జ్యోతి – ఆశాజ్యోతి
ఇంటింటి చదువు – దేశం వెలుగు
అందరి చదువు – సూర్యుడి వెలుగు ॥మ॥



వెట్టిచాకిరి చేస్తే – నీ బ్రతుకు ఇంతేను
గొర్రెతోకలాగ – ఎదగ లేకున్నావు ॥వె॥

రేయి పగలు, నువ్వు – రెప్పవాల్చకుండ
ఎద్దులాగ, ఎంత – చాకిరీ చేసినా
గుప్పెడు మెతుకులు – గంజి పోస్తారు
ఆధారముందా? – ఆలుబిడ్డలకు ॥వె॥

★★★

## 30. చదువుకోరా - సోదరా!

చదువుకోరా! – సోదరా
మోసపోకురా! – తమ్ముడా ॥చ॥

ఎండవానలు – లెక్కచేయవ్
కండలన్నీ – పిండిచేస్తావ్
పంటలెన్నో – పండనిస్తావ్
బండమనుషుల – పాలు చేస్తావ్ ॥చ॥

తల్లి కలతలు – డబ్బులంటూ
ఆలిగొడవలు – కూడు అంటూ
పిల్ల లరుపులు – ఆకలంటూ
చెవుల వింటావ్ – చేతకాకనె ॥చ॥

చదువుకుంటే – శక్తి కల్గును
చదువుకుంటే – తెలివివచ్చును
చదువు, ఇచ్చును – ధనం, ఘనతను
చదువు, తెచ్చును – కీర్తి, మెప్పును ॥చ॥

★★★

## 31. చదువు రాదని - మమ్ము - మోసగిస్తారు

చదువు రాదని – మమ్ము మోసగిస్తారు
చదువు లేదని – మేము బాధ పడుతున్నాం ॥చ॥

ఎన్నికలంటూ – నాయకులొచ్చి

## 33. సాగు చేయుచు - చక్కగా చదవరా

సాగు చేయుచు – చక్కగా చదవరా
రైతు సోదరా! – ఎక్కువ పండుర ॥సా॥

ఎవసాయానికి – ఎండు బక్కలు
ఏవీ పండవూ తిండి – వుండదు
కడుపులో మంటా – ఇంట్లో తంటా
ఏటా కరువే – బతికే దెట్లా ॥సా॥

మంచి ఎరువులు – విత్తనాలు
తెలుసుకుంటావ్ – చదువుకుంటే
మంచి పంటలు – ఇంటికొస్తాయ్
మంచి బ్రతుకు – బ్రతకగలవు
కడుపు నిండా – తిండి తింటావ్ ॥సా॥

వేలిముద్దర – వేయరాదోయ్
రాత్రి బడిలో – చదువుకోవోయ్
అన్ని వనరులు – తెలిసికోవోయ్
అధిక దిగుబడు – లందు కోవోయ్
నిన్నే అంతా – మెచ్చగలరోయ్ ॥సా॥

★★★

## 34. చదువుకుంటానమ్మ - బడికి నన్నంపవే

చదువుకుంటానమ్మ
బడికి నన్నంపవే ॥చ॥

ఇంటిపన్లు – చెయ్యమంటావ్
ఇంటింటి – కెళ్లమంటావ్
బడికి పోయి – చదువుకుంటా
బతుకు తెరువు – కలుగునంట ॥చ॥

మా వరకు – రాదయ్యా
మాకు సదువు – నేకనే ॥బె॥

రాతిరి బడి – కెల్తాము
మా రాత – మార్చవయ్యా
సదువులన్ని – నేర్చుకొని
సక్కగాను – బతుకుతాం ॥బె॥

★★★

## 36. గుడిసె, గుడిసెకు వచ్చి - ఓటు లడిగాడు

గుడిసె, గుడిసెకు వచ్చి – ఓటు లడిగాడు
ఎం.ఎల్.ఎ. అయ్యాడు – ఎంకయ్యబాబు ॥గు॥

నీటు గోటుగాను – నిన్న నొచ్చాడు
దండము పెట్టాను –సూడనేలేదు
ఆపీసర్లతో – అతి ఠీవిగాను
మాట లాడాడయ్యా – మహరాజులాగ ॥గు॥

సదువు రాదని, నన్ను – సూడనే లేదు
పల్లెవాడని నన్ను – పట్టించుకోడు ॥గు॥

సదువుకుందా మింక – రాత్రి బడిలోన
నేర్చుకుందామన్ని – రాజకీయాలు
మంచి మార్గంలోనె – నడుచుకుందాము
బీద ప్రజలకు – మనం సేవ సేద్దాము ॥గు॥

గుడిసె, గుడిసెకు వెళ్లి – ఓట్లడుగుదాము
గుడిసెలవారికి – మేలు సేద్దాము
గ్రామరాజ్యం, మనం – స్థాపించుకుందాం
రామరాజ్యం, మనం – సాధించుకుందాం ॥గు॥

★★★

మేలుచేసే – నాయకులను ॥చ॥

గాంధి కోరిన – రామరాజ్యం
గ్రామరాజ్యం – తెచ్చుకుందాం
కులము, మతము – చూడకుండా
ఎన్నుకుందాం – మంచివారిని ॥చ॥

మాయమాటలు – చెప్పి మనలను
మోసగించే – వారి నెపుడు
నమ్మకుండా – చదువుకుందాం
వేలిముద్దర – వేయకుండా
సంతకాలిక – నేర్చుకుందాం
రాత్రిబడిలో – చదువుకుందాం ॥చ॥

★★★

## 39. మనది - స్వతంత్ర దేశం

మనది – స్వతంత్ర దేశం
మనది భారత దేశం ॥మ॥

దేశనాయకులు – త్యాగాల్చేసి
సంపాదించిన – స్వాతంత్ర్యం
మనకు ఇచ్చారోయ్ – స్వారాజ్యం
మన కర్తవ్యం – చేయాలోయ్ ॥మ॥

అప్పులకోసం – పరదేశాలకు
పాకులాడటం – దౌర్భాగ్యం
అరగదు, తరగదు – మన భాగ్యం
నిధి నిక్షేపాల్, నదీజలాలు – మనసొత్తు ॥మ॥

నడుములు వంచి – పనిచేయాలి
కులమతతత్వాల్ – విడనాడాలి

## 41. చిన్నితమ్ముడా ! లేర - ముద్దుతమ్ముడా ! రార

చిన్నితమ్ముడా ! లేర – ముద్దుతమ్ముడా! రార
వేవేగ, రావాలి – వెంటనే, చదవాలి ॥చి॥

చిగురాకు – నీ మెదడు
చిరుమొగ్గ – నీ బుద్ధి
గనిలోని – రతనాలు
నీ శక్తి – యుక్తులు ॥చి॥

అమ్మ కన్నది – నిన్ను
కష్టాలు పడి – మున్ను
తెలుగు తల్లి – నిన్ను
వెలుగుకు – రమ్మంది ॥చి॥

ఆంధ్ర సోదరు–లెంతో
ఆదరింపగ–నిన్ను
భారతీయులు–మెచ్చ
బాగుగా – చదువుకో ॥చి॥



## 42. నిరక్షరాస్యత - నిర్మూలిస్తాం

నిరక్షరాస్యత – నిర్మూలిస్తాం
జాతి ప్రగతిని – సాధిస్తాం ॥ని॥

నిరక్షరాస్యత – జాతికి నష్టం
అజ్ఞానానికి – అదిమూలం
అభ్యుదయానికి – ఆటంకం
మానవజాతికి – కళంకం ॥ని॥

అక్షరాస్యత – అందరి సొత్తు
అందరి హక్కు – అభ్యుదయం
దేశ ప్రగతికి – అక్షరాస్యతే
ముమ్మాటికి – మూలాధారం ॥ని॥

చదివితే మనమే - గద్దె ఎక్కుతాం
చదివితే మనమే - నాయకులౌతాం
చదివితే మనమే - మంత్రులమౌతాం
చదివితే దేశం - చక్కదిద్దుతాం ॥స్వ॥

★★★

## 44. అఆలు రావయ్య - ఆదుకోవయ్య

అ ఆలు రావయ్య - ఆదుకోవయ్య
నిజముగా, నేనొక - మనిషినే, కానయ్య ॥అ॥

అ, ఆలు నేర్పింద? - అమ్మైన, నాకు
ఇ, ఈలు నేర్పార? - పొరుగువారైన
బడికి పంపాడా? - నా బాబు, నన్ను
సంతకం రాదయ్య - చవటను, నేనయ్య ॥అ॥

ఇరుగు, పొరుగువారు - ఈసడించారు
వెర్రివాడన్నారు - వీధిలోవారు
పశువైన మేలు - నా కంటె అంటారు
అవమాన మింకెట్లు - భరించమంటారు ॥అ॥

కూడు దొరకదు - నాకు, కడుపు నిండాను
గుడ్డ కట్టలేదు - ఒంటినిండాను
గుడిసైన లేదు - ఏ వూరిలోను
పశువుగా, పుట్టినా - బాగుండునేమో ॥అ॥

చదువు చెప్పాలని - పెద్దలొచ్చారు
బుద్ధిగా, ఇకనైన - చదువుకుంటాను
సంతకం, చేస్తాను - చక్కగా ఇకను
తెలివి కోసమె - నేను చదువుకుంటాను ॥అ॥

★★★

వారి శక్తిని – వారి యుక్తిని
తీర్చిదిద్దెను – పెద్ద చదువులె ॥చ॥

చదువు వల్లనె – త్యాగపురుషులు
చదువు వల్లనె – స్వతంత్రయోధులు
శక్తిమంతులై – సాధించారు
స్వాతంత్ర్యాన్ని – ప్రజలకోసమే

భారత దేశం – కొల్లగొట్టిన
పరపాలకులన్ – పారద్రోలిరి
చదువందరికి – వజ్రాయుధము
చదువే ప్రగతికి – సోపానం ॥చ॥

★★★

## 47. మేలుకోవోయ్ - వయోజనుడా!

మేలుకోవోయ్ – వయోజనుడా!
చదువుకోవోయ్ – చక్కగాను ॥మే॥

వయోజనుడా! వలదు సిగ్గిక
పలక బలపం – చేతపట్టి
అక్షరాలిక – దిద్దుకోవోయ్
అంకెలన్నీ – నేర్చుకోవోయ్ ॥మే॥

కాయ కష్టం – చేత కల్గిన
ఫలితమంతా – పరులపాలే
చదువుకోవోయ్ – బాగుపడవోయ్
చదువె, యిచ్చును – సర్వసుఖములు ॥మే॥

★★★

## 50. కష్టజీవుల్లార - కలత చెందకుడు

కష్టజీవుల్లార – కలత చెందకుడు
అక్షరాస్యులైతే – వృద్ధి పొందెదరు

మండుటెండల్లోను – ఎంత శ్రమపడ్డా
ఎముకలు పిండైన – చెమటెంత కారినా
రక్తమంతా ఉడికి – ఆవిరౌతున్నా
కడుపునిండా – తిండి – కలుగదే మీకు ॥క॥

శ్రమపడి మీ రెంత – పనిచేయుచున్నా
పనికి తగిన ఫలం – మీ కందలేదు
రాత్రి బడిలో మీరు – చదువుకుంటేను
శక్తియుక్తులు కల్గు – స్వల్పకాలంలో ॥క॥

రాయడం, చదవడం – రావాలి మీకు
సంతకం, చేయాలి – చదవాలి, మీరు
పాఠాలు చదవండి – పత్రికల్లోని వార్తలు
చదవండి – మీ మేలు కోసం ॥క॥



## 51. భారతీయులం - అందర మొకటే

భారతీయులం – అందర మొకటే
జాతిగౌరవం – నిలబెట్టాలి
మన జాతి గౌరవం – నిలబెట్టాలి ॥భా॥

గాంధి, నెహ్రూ – పటేల్, అజాదు
శాస్త్రి, ఇందిర – నీలం, గిరియు
రాధాకృష్ణ – దుర్గాబాయి
టంగుటూరి – తెన్నేటి, నాయకుల్ ॥భా॥

(శాస్త్రి = లాల్‌బహదూర్ శాస్త్రి, నీలం = నీలం సంజీవరెడ్డి, గిరి = వి.వి. గిరి)

## 53. చెట్టు పుట్ట - ఎక్కుతావు

చెట్టు పుట్ట – ఎక్కుతావు
ఓ గడుసు – పిల్లోడా! ॥చెట్టు॥

చదువు సందె – మానినావు
ఓ పెంకిపిల్లోడా!
అమ్మ నాన్న – అన్నం పెట్టి
బడికి, పంపుతారు, నిన్ను ॥చెట్టు॥

బడికి వెళ్లకుండ నీవు
గోళికాయలు – ఆడతావు
తోటలోకి – పారిపోయి
(బిల్లాకర్ర) గొణేబిళ్ళ – ఆడతావు ॥చెట్టు॥

చెట్టులెక్కి – కాయలేరి
కడుపు నిండా – తింటావు ॥చెట్టు॥

తోటకాపు – నిన్ను కొట్టి
అయ్యముంద – రెట్టి నిన్ను
నడ్డిమీద – ఏస్తాడు
బడికి పోర – పెంకోడ ॥చెట్టు॥

చదువుకుంటె – నిన్ను జనులు
మంచివాడని – అంటారు
ధనం కీర్తి – నీకొస్తాయ్
చదువు చెప్పు – తాము రారా! ॥చెట్టు॥

★★★

## 54. నేర్పాలి - నేర్పాలి - అక్షరాలు నేర్పాలి

నేర్పాలి, నేర్పాలి – అక్షరాలు నేర్పాలి
అందరం, నేర్పాలి – అందరికి, నేర్పాలి ॥నే॥

బడిలో, గుడిలో ఆరుబయటా – వయోజనులకు విద్య నేర్పగ
ఉపాధ్యాయులు, సంఘసేవా – తత్పరుల్, కృషిచేయుచున్నార్ ॥భా॥

వయోజనులే, విద్య నేర్చిన – అన్ని రంగములందు వృద్ధిని
పొందగలరని, కేంద్రరాష్ట్రాల్ – సల్పుచున్నవి, కృషిని, నిరతం
సహకరించర, వయోజనుడా! – ఓటు విలువను తెల్సికోరా
మంచి వారికె, ఓటు వేయర – మంచి చేయర, దేశ జనులకు ॥భా॥

***

## 56. ఎవ్వరైనా - చదవవచ్చును

ఎవ్వరైనా – చదవవచ్చును
ఎప్పుడైనా – చదవవచ్చును ॥ఎ॥

వయసుతో, పనిలేదు – చదువుకు
వృత్తితో, పనిలేదు – చదువుకు
స్త్రీలు పురుషులు – చదవవచ్చును
పగలు రాతిరి – చదవవచ్చును ॥ఎ॥

వయోజనులకు – పేద ప్రజలకు
వారి ప్రగతికి – విద్య నేర్పగ
కోట్లకోలది – ఖర్చు పెట్టుచు
ముందు కొచ్చెను – మన ప్రభుత్వం ॥ఎ॥

పల్లెలందును – పట్టణాలలో
రాత్రివేళల – బడులయందున
వయోజనులకు – విద్య నేర్పగ
ఉపాధ్యాయులు – వచ్చినారోయ్ ॥ఎ॥

సంతకాలు – నేర్చుకోండి
పుస్తకాలు – చదువుకోండి

## 58. ఓ చిన్నపిల్లోడా! - ఎంత చలాకివాడా!

ఓ చిన్నపిల్లోడా! – ఎంత చలాకివాడా!
తోట్లంట దొడ్లంట – ఊరికే తిరిగావు ॥ఓ॥

బడిలోకి వెళ్లకుండ – తండ్రివెంట, తిరగకుండ
చదువులేక, పనిలేక – పచ్చిరౌడీవౌతావా ॥ఓ॥

సోంబేరి వౌతావు – చదువుకోకపోతేను
గూండావు, అవుతావు – బడికి వెళ్లకుంటేను
దొంగపన్లు చేస్తావు – దొడ్డవారు, కొడతారు
ఇకనైనా బడికొచ్చి – చదువుకోర, చిన్నోడ! ॥ఓ॥

★★★

## 59. చదువుకోరా - అన్న రైతన్నా!

చదువుకోరా – అన్న రైతన్నా!
చదువు చెపుతామురా రైతన్నా! ॥చ॥

నీ తాతతండ్రులకు – చదువు లేదంటావు
నిన్ను వారెన్నడూ – చదివించలేదంటు
నీ పిల్లలను, నీవు – చదివించనంటావు
నీ తప్పు తెలిసికో – రైతన్నా – ఓ రైతన్నా! ॥చ॥

ఎవసాయం, సేయగా – దుక్కిబక్కలు లేవు
నీదంటూ, ఒక బండీ – లేదే, లేదన్నావు
ఎవరింటికో ఎల్లి – ఎంతో బతిమాలి
ఎవసాయం పనిముట్లు – ఎరువూ తెస్తావు ॥చ॥

# PART - II

## నీతి పద్యాలు

### ప్రయోజన విద్య - పద్యాలు

**రచన : డా. ఎం.వి. సత్యనారాయణ**

తల్లిదండ్రులెపుడు దైవ సమానులే
మంచి మనసుతోడ మనము వారి
మాటలు వినుచుండి, మంచి మార్గమునందు
మసలుచుండ గల్గు, మంచి మనకు 1

గురువు లేని విద్య కూడ దెవ్వరికైన
గురువు దేవుడు; మన గుణములన్ని
మంచివైన నతడు మనకు చదువు నేర్పి
మంచి జ్ఞానము కలిగించు నతఁడు 2

దేవుడు మన కెంతొ తెలివి యిచ్చెను గాని
తెలివి యెంతయున్న దెలిసికొనక
పశువు వలెనె మనము పలు పాట్లు పడుటకు
మనమె కారణమని, మనసు చెప్పె 3

పసితనంబు నందె బాలురతో నాడి
బాలికలను గూడి బాధ పెట్టి
చిలిపి చేష్టలెన్నొ చెడుబుద్ధితోజేసి
చెడ్డవాడనైతి చేటు కలిగె 4

అమ్మ బువ్వ పెట్టి యందఱి పిల్లల
తోడ బడికి వెళ్లి తోటివారి
వలెనె, చదువుమంచు, పలుమార్లు చెప్పెను
అమ్మ మాట వినక, యాడుకొంటి 5

అందరివలె నేను, నక్షరాల్ వ్రాయక
ఆటలాడి గురువు మాట వినక
అల్లరి పనులెన్నొ యాతని యెదుటనే
చేసియుంటి గాన జెడితి, నేను 6

ఆడపిల్లలకును నచట శ్రద్ధగ విద్య
నేర్పుచుండె గురువు నిష్ఠతోడ
బుద్ధిగాను వారు పుట్టె దాశయుగల్గి
చదువు చుండిరపుడు చక్కగాను 14

చీడపురుగు వలెను, జేరి చెంతను వారి
మనసు చెదరగాను మాటలాడి
వ్రాయకుండ వారి ప్రక్కనుండి, చెఱచి
చెడ్డకోతి వలెను; చెడితి నేను 15

మంచి పిల్లలకును మాట తెప్పించితి
గురువు వారి జూచి కోపగించెఁ,
తల్లిదండ్రులింట దగురీతి దండింప,
ఆడపిల్లలెన్నొ యనిరి నన్ను 16

మంచి చెప్పినట్టి మగపిల్లలకు నేను
మారు పేర్లు పెట్టి మనసు నొవ్వ
హింస పెట్టుచుండ హింసించి రందఱు
తప్పు చేయగలిగెదగిన శిక్ష 17

కాలు సేతు లన్ని కట్టి కొట్టుటె గాక
బాలురందఱునను, పచ్చి బూతు
లెన్ని తిట్టుచున్న మిన్నకుంటినపుడు
చెడ్డ చేయ నాకు చెడ్డ కలిగె 18

బడిని గుడిగ నేను భావించి మదిలోన
గురువు దేవు డనెడి గురియె యున్న
సాటి పిల్లలచట మేటి దేవతలన్న,
చదువ గలిగి యుంటి శ్రద్ధతోడ. 19

చదువు లక్ష్మి, వాణి, సాటిలేదు చదువు
కెన్నడైన భువిని; కన్నవారు
నన్ను బడికి బంప; నాచేత నాకన్ను
పొడుచు కొంటి, నాకు బుద్ధి లేక 20

పేదవారికైన,పెద్దల కయినను
బాలబాలికలకు, బడులలోన
గుడులలోన; మీదు గుడిసెలందైనను
చదువు చెప్పగలరు, చదువుడిపుడు 28

నింద సేయ నొరుల నీకేమి ఫలమిప్డు?
చదువు కేదియైన సాటిరాదు
గతము గూర్చి మఱచిఘనులు నేర్పెడి విద్య
నేర్చు కొమ్మిపుడిట నేర్పుతోడ 29

అక్షరాలు నీకు నతి సూక్ష్మముగ నేర్పు
పద్ధతులును గలవు బాధపడకు;
పేర్లు, చదువగలవు పేర్లు వ్రాయగలవు
అల్పకాలమందె యన్ని తెలియ 30

బడికి బోవకున్న బడికి వెళ్లియునాడు
చదువకున్న; నిపుడు చదువగలరు,
ఎట్టివారయినను, ఎంతవయస్సున్న
చదువు నేర్వగలరు శ్రద్ధయున్న 31

ఇంటిలోని కేగి యెందఱికైనను
ఎప్పుడైన జదువు నెక్కడైనఁ
చెప్పగలిగినట్టి శ్రేష్ఠులౌ గురువులు
వచ్చుచుండ మీరు వగవ నేల? 32

మీకు మేలు సేయ మీ యిండ్లకే వచ్చి
చదువు నేర్పువారి శ్రద్ధచూచి
శ్రద్ధతోడ మీరు చదువుట వ్రాయుట
నేర్చుకొనుడు నేడె నేర్పు మీఱ 33

చదువు వలన గల్గు సర్వశక్తులు మీకు,
సర్వ గౌరవ సుఖశాంతు లెల్ల
విద్యవలన గలుగు; వినుడు పెద్దల మాట;
సంతకంబు సేయచదువు కొనుడు. 34

ఆలుమగలు కూడ నైకమత్యము తోడ
రాత్రి బడికి వెళ్లి వ్రాయవలెను
అక్షరాలు పదము లతి చక్కగా, వారి
కఖిల సుఖము ధనము కలుగుచుండు 42

కూలి నాలి చేయ, కూడు గుడ్డల కెప్డు
కొఱత దీరదంద్రు కొందఱవని;
చదువు నేర్చువారు సంతకంబే సేయ
కడుపు నిండ తిండి కలుగకున్నె? 43

మనుజుడైన వాడు మనిషి గా జీవించి
గౌరవంబుతోడ, కాలమెపుడు
గడపగలడు చదువు కల్గియున్న నెపుడు
కష్టపడదు నిజము కల్గు ధనము 44

వయసు వచ్చినదని, వయసు మళ్లినదని
చదువు మానరాదు; సర్వులకును
చదువు ముఖ్యమౌట, చదువు సాగించుట
మనుజ జాతి విధియె, మాన్యులార! 45

పగటి బడుల కేగి పలకపై నక్షరాల్
వ్రాసి చదువవచ్చు పాఠములను;
బడికి వెళ్లకున్న పంతులు విద్యను
నేర్పగలడు మీకు, ఇంటి కడనె 46

పగటి పూట ఎల్ల పనులు చేసికొనుచు
కూడుగుడ్డ గూడు కూర్చుకొనుచు,
తీరిక గలయప్డు తెలివిగా చదివిన
రాబడి పెరుగు మన వ్రాతమారు 47

ఎట్టివారికైన, ఏ వృత్తి చేసిన
చదువు వలన గల్గు శక్తియుక్తి
శక్తి యుక్తులున్న సర్వంబు సాధ్యంబు
చదువె మూలమంద్రు శాస్త్రవిదులు 48

సంతకంబు చేసి చక్కగా చదివెడి
మనుజుడవనిలోన మాన్యుడగును
వేలిముద్ర లేసి విషయంబు తెలియక
నష్టపోవుచుంద్రు నరులె యవని 56

మోసగాంద్రు నేడు ముదముతో అన్యుల
చెంత చేరుచుంద్రు చేటుచేయ;
అక్షరాస్యులయిన హాని పొందరు, గాని
వేలిముద్ర వేయ వెతలు కలుగు. 57

యాంత్రిక యుగమిప్పుడన్ని రంగములందు
భారతీయు లెల్ల ప్రతిభ చూపి
శక్తియుక్తులలర సంపదల్ పెంపొంద
అక్షరాస్యులగుట యవసరంబు 58

అక్షరాస్యులగుచు అజ్ఞానమును వీడి
పౌరులన్నిచోట్ల ప్రజ్ఞతోడ
దేశవృద్ధి కొఱకు దేశరక్షణకును
పాటు పడుట మేలు భాగ్యమబ్బు 59

కులమతముల పేర కుజను లెల్లప్పుడు
కలహములను పెట్టి కడకు భరత
దేశ నాశమునకు దీక్షపూనిరిగాన
అక్షరాస్యులయిన హాని రాదు. 60

అన్ని దేశములకు అభివృద్ధి హేతువు
చదువుగాన, మనము చదువవలెను
చదువు వారి సంఖ్య చాల తక్కువ గాన
విద్య నేర్పవలెను వివిధ జనులు 61

పంట భూములందు, పంటలు పండించి
తిండి పెట్టు రైతు దేశ ప్రజకు;
రైతుకు చదువున్న రాణించు వృత్తిలో
ఆత్మ గౌరవంబు అధికమగును 62

బీదతనము పోవు పేదలు చదివిన
కార్మికులు చదివిన కలుగు ధనము
చదువుకొన్న స్త్రీలు చక్కగా బ్రతుకుచు
గౌరవింపబడరె ఘనముగాను 70

విద్య నేర్చి నాడు వివిధ దేశీయులు
భరత దేశమందు, పాదమూని
పాలనంబు సల్పి భాగ్యవంతులయిరి
చదువురాని మనకు శ్రమయె మిగిలె 71

చక్కగాచదువక సర్వరంగములందు
వెనుకబడితిమిపుడు విశ్వమందు
అప్పులడుగు కొనుచు, పప్పుకూడు తినుచు
పబ్బము గడుపంగ, బాధకాదె? 72

అప్పు తీర్చుకున్న అన్యదేశీయులు
మనల నెన్ని నాళ్లు మసల నిత్తు
రప్పు తీర్చు భారమిప్పుడందరి పైని
పడిన దంచు, తెలియవలెను మనకు 73

విద్య నేర్చి మనము విజ్ఞాన ధనులమై
దేశ సేవ చేసి దీక్ష తోడ
ప్రకృతి సంపదలను ప్రజ్ఞతో, పెంచుచు,
పరులయప్పు తీర్చ భావ్యమగును 74

పుడమిపై జనులకు బుద్ధి కుశలతలో
తీసిపోము, మనము, దీటు తోడ
అన్ని రంగములను ఆర్జించి ప్రావీణ్య
మెంతొ చూపగలము, మేలు కలుగు. 75

జీవనదుల నీరు, సేద్యభూములకును
యంత్రశాలలకును హాయిగాను
పంపవచ్చు కరువు బాధ బాపగవచ్చు
చదువుకొన్నవారు శక్తి చూపి 76

అణువు శక్తికంటె, ఆత్మశక్తియె మిన్న
ఆత్మతత్త్వ మెరుగ, ఆత్మవిద్య
అవసరంబె మనకు; అధ్యాత్మ విద్యయు
భుక్తి సుఖము లిచ్చు, భువిని మనకు 84

ఏది చేయవలెనొ, యేది–చేయగ రాదొ
విద్య తెల్పుచుండు వివిధ గతులు
విద్య వ్యక్తి శక్తి వికసింపజేయును
విద్య లేనివాడు వింత పశువు 85

చదువులేనివాడు సంఘజీవియె గాన
సంఘవృద్ధి కతడు సహకరింప
జాల, డతడు కూడ జదువ, నతనికిని
మేలు; వాని చదువు మేలు మనకు 86

ఎవడు చదువకున్న ఎంతొ నష్టము కల్గు;
ప్రజల రాజ్యమగుట ప్రజకు కీడు;
శ్రామికులను బడుగు జనులను చదివింప
విద్యయున్న వారి విధియె నేడు 87

చదువవలెను నేడు సాంకేతిక జ్ఞాన
మొసగునట్టి విద్య, భువిని, గగన
సాగరముల ప్రగతి సాధించి, మన దేశ
రక్షణమును జేయ; రండు చదువ 88

